# విస్డమ్

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాస పత్రిక





చందా వివరాలు

| | |
|---|---|
| శాశ్వత చందా | 1,000 00 |
| జీవిత చందా | 200 00 |
| 3 సంవత్సరాలకు | 33 00 |
| సంవత్సర చందా | 12 00 |
| ఎయిర్ మెయిల్ (1 సంవత్సరం) | 75.00 |
| సీ మెయిల్ (1 సంవత్సరం) | 40.00 |

చందాలు పంపవలసిన చిరునామా

విస్డమ్ పబ్లికేషన్స్,
9. దేశికా రోడ్డు. మైలాపూరు.
మద్రాసు 600 004


## ఈ సంచికలో

మే 1983


| | |
|---|---|
| ధ్యానం: | 2 |
| సంపాదకుని పేజీ | 2 |
| వక్తృత్వం ఒక కళ | 4 |
| మహానటుడు బళ్లారి రాఘవ | 7 |
| తులసీ దాసు | 9 |
| గుండె జబ్బుతో 30 ఏళ్లు | 13 |
| జాతీయ వార్తలు | 15 |
| మీ ప్రశ్నలు | 17 |
| బహుమతి పొందిన వ్యాసం | 20 |
| యోగాసనాలు | 23 |
| కార్టూనులు గీయటం ఎలా? | 25 |
| ఎందుకు? | 27 |
| ఎలా? | 27 |
| కలం స్నేహితులు | 28 |
| జీవితంలో కలుపుగోలుతనం | 30 |
| ప్రపంచ వార్తలు | 33 |
| పోటీలు | 36 |
| విచిత్ర ప్రాణి | 41 |
| టెలిపతీ ద్వారా వైద్యం | 43 |
| పోటీలు - ఫలితాలు | 47 |


★

ముఖచిత్రం - కలర్ ట్రాన్స్‌పరెన్సీ:
పి. రవిచందర్, విజయవాడ-11.

★

తెలుగు 'విస్డమ్' కు ఇది రెండో సంవత్సరం

## ధ్యానం

### మంచి వాడు నిరంతరం జాగరూకుడై ఉంటాడు!



జేమ్స్ ఎలెన్

ఈ విశ్వాన్ని నడిపించే మహత్తర ధర్మ సూత్రాన్ని అవగాహన చేసు కోడంవల్ల మంచివాడు తన శత్రువు లను ప్రేమిస్తాడు; ద్వేషాన్నీ, క్రోధాన్నీ, ఆశలనూ అధిగమిస్తాడు. తనకు ఏది ప్రాప్తమో అదే తనకు లభిస్తుం దని తెలుసుకుంటాడు! తాను చెయ్యని నేరాలకు కేవలం విశ్వ సూత్రం చేతిలో సాధనాలై శత్రువులు తనను వేధి స్తున్నారని గ్రహిస్తాడు. అందుకే వారిని అతడు నిందించడు. ఓర్పుగా అన్ని బాధలూ అనుభవిస్తాడు. అందరి ఋణాలూ తీరుస్తాడు. కొత్తగా ఎవరికీ ఋణపడకుండా జాగ్రత్త పడతాడు. నిరంతర జాగరూకతతో మంచివాడు తన పనులలో ఎలాంటి దోషం లేకుండా చూసుకుంటాడు! ●

## సంపాదకుని పేజీ

### 'ప్రత్యేకత' వ్యక్తిత్వాన్ని పెంచుతుంది!

స్వతంత్రమైన మనస్సుకి ఉండే ఒక ప్రధాన లక్షణం 'ప్రత్యేకత' (individuality). నిత్య జీవితంలో ఎలాంటి పరిస్థితినైనా విచక్షణతో ఎదుర్కోడానికీ, సరియైన అవగాహన సాధించడానికీ, తల వంచవలసి వచ్చే పరిస్థితిలో కూడా తలెత్తుకొని తిరగడానికీ అది మనిషికి సహాయం చేస్తుంది. 'ఒక నాయకుని అడుగు జాడలలో నడిచే గొర్రెల మంద లాంటి వాడు కాడు అతడు' అని అది నిరూపిస్తుంది.

'ప్రత్యేకత' గల వ్యక్తి ఎప్పుడూ నవ్వుతూ కనిపిస్తాడు. ఎలాంటి గడ్డు పరిస్థితులెదురైనా నిర్భయంగా తన గమ్యం వైపు సాగిపోతూ ఉంటాడు. బాధ్యత గల నాయకునికి ఉండే ప్రశాంతమైన చిత్త స్థైర్యంతో

### మిక్కిలి పెద్ద పవరు స్టేషన్

ద. అమెరికాలోని 'పరానా' నది మీద 'ఇటైపు' వద్ద ఒక డామ్‌తో పాటుగా, 1200 కోట్ల డాలర్ల వ్యయంతో నిర్మించబోతున్న జలవిద్యుత్ కేంద్రం ప్రపంచం అంతటి లోకీ మిక్కిలి పెద్ద కేంద్రం కాబోతూంది. 1988 నాటికి నిర్మాణం పూర్తి కానున్న ఈ కేంద్రం 1.26 కోట్ల కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయగలదు.

"వివేకం కన్న పదునైన కత్తి ఇంకోటి లేదు." —మాక్సిమ్ గోర్కీ

ప్రతి విషయాన్నీ అతడు గమనిస్తూ ఉంటాడు. తన సర్వ శక్తులూ వినియోగించి అసాధ్యాన్ని సాధ్యం గానూ, అసంభవాన్ని సంభవం గానూ చెయ్యడానికి అతడు కృషి చేస్తాడు. స్టేట్స్‌మన్ లాగ పొగడ్తలనూ, తెగడ్తలనూ లెక్క చేయకుండా, సుదూర భవిష్యత్తు వైపు చూస్తూ, స్థిర చిత్తంతో సరియైన పని సాగించడానికి అతడు వెను కాడడు.

మన 'ప్రత్యేకత' మన వ్యక్తిత్వానికి పుష్టి కలిగిస్తుం దని మనం మరచి పోకూడదు. 'మంది'ని అనుసరించడం మొదలు పెడితే మనమూ ఆ మందలో కలిసి పోతాం; దారీ, తెన్నూ లేకుండా పశువుల మందలాగ నలు



గురూ ఎటు పోతుంటే అటే గుడ్డిగా పడి పోతూ ఉంటాం. బజారుకి వెళ్ళి సరుకు నాణ్యం విచారించకుండా దాని సరియైన ధర తెలుసుకోకుండా కొట్టువా డడిగినంత ధర ఇచ్చి అత డిచ్చిన సరుకు పట్టుకొస్తే అంత కంటె మూర్ఖత్వం వేరే ఉండదు. అయినా - చదువుకున్నా మనుకునే వాళ్ళు కూడా ఎలాంటి సొంత ఆలోచనా లేకుండా సూదంటురాయి వేపు ఇనుము ఆకర్షించబడ్డట్టు వంచకుల మోసాలకు గురి అవుతూ ఉండడం ఆశ్చర్యం కలిగిస్తుంది.

తోడేళ్ళు ఎప్పుడూ గొర్రెతోలు కప్పుకునే కనిపించడానికి ప్రయత్నిస్తాయి. నకిలీ సాధువులు తాము దేవదూతల మంటూ ఇళ్ళ కప్పుల మీద నుంచి అరుస్తూ ఉంటారు. బానిసలుగా చేసుకునే వాళ్ళు మంచి మిత్రుల్లాగే మొదట మన దగ్గర చేరుతారు. 'ప్రత్యేకత' (individuality) అనే లక్షణం మనలో ఉంటే అలాంటివా రందరినీ భూతద్దంతో మనం పరిశీలిస్తాం. దేవతలు అడుగు మోపడానికి భయపడే ప్రదేశాలలోకి చొరవగా ప్రవేశించడం తగదు. స్వార్థంతో భట్రాజులలాగ అందరినీ పొగుడుతూ ఉండే అవకాశవాదుల లక్షణం అది అని మనం గుర్తించాలి. మంచుమీద నడవబూనడం, గాలిగుమ్మటాల్లాగ గాలి ఎటు వీస్తే అటు తిరుగుతూ ఉండడం సుశిక్షితం కాని మనస్సుకి ఉండే దౌర్బల్యం. దొంగ బాబాలు స్వర్గానికి రాచబాటలు మనకు ప్రదర్శిస్తారు. కాని, అవి ఎలాంటి అఖాతాల వైపు మనల్ని నడిపిస్తాయో గుర్తించి మనం జాగ్రత్త పడాలి.

నాయకత్వానికి 'ప్రత్యేకత' ముఖ్యమైన లక్షణం. 'ప్రత్యేకత' ఉన్న వ్యక్తి ఉన్నత పదవిలో ఉంటే అతని ప్రభావం అతని చుట్టూ ఉన్న అందరికీ అదృష్టంగా పరిణమిస్తుంది. ఉన్నత పదవిలో ఉంటూ ఆ పదవిని దుర్వినియోగం చేసే వ్యక్తి కంటె పాపాత్ముడు మరొక డుండడు. అతడు తనకు తాను హాని కలిగించుకోడమే కాక తన ప్రభావం వల్ల ఇతరులను కూడా చెడుమార్గాలకు మళ్ళిస్తాడు. ●

"నేలలో పాతేసినా 'నిజం' తమాషాగా తిరిగి మొలకెత్తుతుంది." —బ్రయింట్

# వక్తృత్వం ఒక కళ

మెహబూబ్ షా నవాజ్



[మెహబూబ్ షా నవాజ్ (జనవరి 1952 అక్టోబరు 13) మద్రాసులోని 'షా నవాజ్ స్పీచ్ అండ్ హియరింగ్ ఇన్‌స్టిట్యూట్' కి డైరెక్టరు. వక్తృత్వ కళలోనూ, వ్యక్తిత్వ వికాస కళలోనూ హైస్కూలు, కాలేజి విద్యార్థులకు ఆయన శిక్షణ ఇస్తున్నారు.]

"నిజంగా చెప్పదగిన అంశాలు ఉన్న వ్యక్తికి శ్రోతలు తప్పకుండా దొరుకు తారు" అన్నాడు థామస్ కార్లైల్. అయితే ఒక వ్యక్తికి ఎంత విజ్ఞానం ఉన్నా, తన భావాలు అవతలి వారికి స్పష్టంగా అంద జేయా లంటే అందుకు తగినంత నేర్పు కూడా అతనికి అవసరం అవుతుంది. వేగం విపరీతంగా పెరిగిపోతున్న ఈ యుగంలో మనం చెప్పదలుచుకున్నది వీలైనంత సంక్షిప్తంగానూ, శక్తిమంతంగానూ చెబితే తప్ప తీరుబాటుగా వినే ఓర్పు గాని, తీరిక గాని ప్రజలకు లేవు.

మన భావాలు మరింత బాగా ప్రకటించ గలగడానికి కొన్ని సూత్రాలు మనకు సహాయం చేయవచ్చు. ఇతర సహజ ప్రవృత్తులతోపాటు 'భావ ప్రకటన' కూడా మని

---

## భావపరిచయ పోటీ

(మార్చి 1983)

"బయట పడితే ఒంపు సొంపులు
నలుగురిలో తల వంపులు!"

—ఎస్. మనోహర్, నెల్లూరు.

* * *

"ఇంగ్లీషు దుస్తులు వేసుకున్న ఇండియన్
లేడీ! నిన్ను రక్షించే నాథు డేడీ?"

—టి. శ్రీనివాస్, కాకినాడ.

* * *

"ఆ సంస్కృతి ఆమెది,
అనాగరికత వారిది"

—డి.ఎస్. జాన్సన్, పాలకొల్లు.

---

'ప్రతీకారేచ్ఛ' అనేది అమానుషమైన మాట!" —సెనెకా

షికి ఉన్న ఒక సహజమైన ప్రవృత్తి (instinct). సంభాషణలో తన మాటలతో ఆకర్షింపబడే శ్రోతల కోసం ప్రతివాడూ ఆరాట పడతాడు. మనం ఒక జోక్ వేసి నప్పుడు, లేదా ఒక చిత్రమైన సంఘటనను గురించి చెబుతున్నప్పుడు ఎక్కువ మంది దానిని విని ఆనందించా లని మనకు ఉంటుంది. అలాంటి సంభాషణల విస్తృత రూపమే వక్తృత్వం. మనలో చాలా మంది తరచు సభలలో మాట్లాడవలసి వస్తుంది. జీవితంలో వ్యాపార రంగంలో గాని, పత్రికలు, రేడియో మొదలైన ప్రచార సాధనాల రంగంలో గాని, రాజకీయాలలో గాని, లలిత కళలలోగాని పైకి రావాలంటే గొంతెత్తి స్ఫుటంగా మాట్లాడి నలుగురినీ ఆకర్షించ గల ప్రజ్ఞ అవసరం.

విందులలో టోస్ట్ ప్రతిపాదించే ప్రసంగం మొదలు, శ్మశానంలో చేసే వీడ్కోలు ఉపన్యాసం (funeral oration) దాకా ప్రసంగాలలో అనేక రకాలు. మొట్టమొదటి వాక్యంతోనే శ్రోతల దృష్టిని ఆకట్టుకుని మనం చెప్పదలుచుకున్న ప్రధాన విషయం చెప్పేదాకా ప్రసంగం ఎలా కొనసాగించాలో మనం తెలుసుకోవాలి. నిండైన గొంతుతో స్వరంలో వైవిధ్యం ప్రదర్శిస్తూ ప్రసంగించాలి.

శ్రోతలు ఆరితేరిన నిపుణులు అయినప్పుడు వారి భాషలోనే వారితో మాట్లాడాలి. జన సామాన్యాన్ని ఉద్దేశించి మాట్లాడితే తేలిక ధోరణిలో ప్రసంగించాలి. శ్రోతల అంతస్తును అంచనా కట్టడానికి వారి వయస్సునీ, విజ్ఞానాన్నీ ప్రమాణంగా గ్రహించవచ్చు. వారు మననుంచి ఏమి ఆశిసూ ఉంటారో అర్థం చేసుకోవచ్చు. "ఈ నాటి ఉపన్యాసాలలో నిజంగా వక్త తన భావాలను శ్రోతలకు అందజేసే ప్రక్రియ అంతరించిపోయినట్టు కనిపిస్తుంది" అనేవారు రాజాజీ. వక్త తను ఎంత గొప్పవాడో శ్రోతలకు నచ్చ జెప్పడానికి, శ్రోతలు వక్త సత్తాను అంచనా కట్టడానికి ప్రయత్నిస్తూ ఉండడమే నేటి ఉపన్యాసాలలో ప్రధానంగా కనిపిస్తుంది.

కంఠ స్వరం, నిలబడే తీరూ, మాట్లాడే విధానం – ఈ మూడూ మంచి ఉపన్యాసానికి జీవగర్ర లాంటివి. మన భావాలను శ్రోతలకు అందజేయా లంటే భగవంతుడు మన కిచ్చిన స్వర పేటికను వీలైనంత చక్కగా వాడుకో వాలి. వక్త మాట్లాడే ప్రతి మాటా శ్రోత చెవులలో పడడానికి కంఠస్వర ■

## 3 ఏళ్లు ప్రయాణించిన ఇన్‌లాండ్ ఉత్తరం



డెహ్రాడూన్ (ఉ. ప్రదేశ్) లో 1979 జనవరి 7న పోస్ట్ చేసిన ఒక ఇన్‌లాండ్ ఉత్తరం 1982 ఆగస్టు 31 న ఢిల్లీలో ఉన్న చిరునామాదారుడికి బట్వాడా అయింది.

"విచారణకు భయపడి పారిపోయే వ్యక్తి తన నేరాన్ని అంగీకరించినట్టే!" —సైరస్

తోడ్పడుతుంది. అలాంటి శిక్షణ లేకపోతే వక్తకీ, శ్రోతకీ మధ్యలో ఎన్నో మాటలు హరించిపోతాయి. ప్రేక్షకులలో చివరి వరుసలో కూచున్న ఎవరో ఒక వ్యక్తిని దృష్టిలో ఉంచుకొని ప్రసంగించవచ్చు. ఉచ్చారణ విస్పష్టంగా ఉండాలి. వాక్యం చివర సాధారణంగా గొంతు తగ్గిస్తూ ఉండడం అందరికీ అలవాటు. ఆ అలవాటు పోగొట్టుకోవాలి. వాక్యం ఆరంభం మీదా, ముగింపు మీదా దృష్టిని ఉంచితే మధ్య భాగం దానంతట అదే స్పష్టంగా వినిపిస్తుంది.

ప్రేక్షకుల ముందు మనం నిలబడే తీరు మన ఆత్మ విశ్వాసాన్ని తెలియజేస్తుంది. నిటారుగానూ, నిశ్చలంగానూ, ధైర్యంగానూ నిలబడాలి. నిరంతరం ప్రేక్షకులందరి కళ్ళూ మనల్ని గమనిస్తున్నాయనే సంగతి గుర్తుంచుకుని అందుకు తగిన విధంగా ప్రవర్తించాలి. మనిషి యొక్క భారీతనం కంటె అతడు నిలబడిన తీరే జనాన్ని అతని వశంలో ఉంచుతుంది. చేతులు సహజంగా కదులుతూ ఉండాలి. పిడికిలి బిగించకూడదు. దానివల్ల నరాల బిగువు తగ్గి సహజంగా మాట్లాడడానికి వీలవుతుంది. ఉత్సాహంగానూ, దృఢ చిత్తంతోనూ మాట్లాడాలి. మరీ ఎక్కువగా అభినయం చేయకూడదు అనవసరమైన హస్త విన్యాసాలు మనం చెప్పే మాటల నుంచి శ్రోతల దృష్టిని మళ్ళిస్తాయి.

ప్రేక్షకులతో అనుబంధం ఏర్పరచుకోవాలంటే వారి కళ్ళలోకి చూస్తూ మాట్లాడడం అవసరం. ఒక్కొక్కప్పుడు ప్రేక్షకులు ప్రతికూల భావంతో మనల్ని తేరిపార చూస్తూ ఉండవచ్చు. అప్పుడు కూడా వారి కళ్ళలోకి సూటిగా చూస్తూ వారికీ తనకూ మధ్య 'అవగాహన' వంతెనను నిర్మించుకోవాలి. సభలో ప్రతి ఒక్కరికీ మనం వాళ్ళతోనే మాట్లాడుతున్నాం అన్న భ్రాంతిని కలిగించాలి. పై కప్పువైపో, చేతిలో ఉన్న కాగితం వైపో చూస్తూ మాట్లాడితే శ్రోతలతో మన అనుబంధం తెగిపోవచ్చును.

వక్తృత్వ కళా రంగంలో తొలి అడుగు పెట్టడానికి మాత్రమే ఈ సూచనలు ఉపకరిస్తాయి. ఏ ప్రజ్ఞ సాధించడానికైనా నిజానికి అడ్డదారి అంటూ లేదు. నిజాయితీతో నిరంతరం అభ్యాసం చేయడం ఒక్కటే సరియైన మార్గం. ●

## మిక్కిలి పొడవైన బ్రిడ్జి



1,800 మీటర్ల పొడుగు ఉండే బ్రిడ్జి నిర్మించే పథకం 'హొన్షూ షికోకూ బ్రిడ్జ్ ప్రాజెక్ట్' చేపట్టిన నిర్మాణాలలో ఒకటి. సేటో సింధుశాఖ (inland sea) కడ్డంగా నిర్మించబడే ఈ బ్రిడ్జి 1985 నాటికి పూర్తి కాగల దని భావిస్తున్నారు.

"మన కుడిచెయ్యి ఏం చేస్తున్నదీ ఎడమ చేతికి కూడా తెలియకూడదు." —మాథ్యూ

# చాగంరెడ్డి నరసింహారెడ్డి, ఎం.ఏ.

భారత దేశంలోని ఇతర రాష్ట్రా లన్నిటిలో లాగానే ఆంధ్ర దేశంలో కూడా 19 వ శతాబ్దంలో జీవితంలోని అన్ని రంగాలలోనూ విశేష ప్రతిభావంతు లైన మహామహులు జన్మించారు. అలాంటి మహనీయులలో ఒకరు: నాటకరంగంలో నూతన ప్రయోగాలు చేసి, తన అసమాన నటనా సామర్థ్యంతో అంతర్జాతీయ విఖ్యాతి ఆర్జించిన మహానటుడు శ్రీ బళ్లారి రాఘవ।



బళారి రాఘవ

'రాఘవ' అసలు పేరు తాడిపత్రి రాఘవాచార్యులు. బళ్లారిని కార్యరంగంగా స్వీకరించడం వల్ల 'బళ్లారి రాఘవ' అనే ప్రసిద్ధి వచ్చింది.

అనంతపురం జిల్లాలోని తాడిపత్రిలో 1880 ఆగస్టు 2 వ తేదీన శ్రీ రాఘవ జన్మించారు. ఆయన తండ్రి తాడిపత్రి నరసింహాచార్యులు. తల్లి శేషమ్మ. 'విషాద సారంగధర', 'చిత్ర నళీయం' 'రామదాసు' వంటి ప్రజాదరణ పొందిన నాటకాలు వ్రాసిన ధర్మవరం కృష్ణమాచార్యులు గారి చెల్లెలు ఆమె. న్యాయశాస్త్రంలో పట్టభద్రుడై . బి.ఎల్. పట్టా పొంది, బళ్లారిలోని తన మేనమామ కృష్ణమాచార్యులు గారితో కలిసి న్యాయవాదిగా రాఘవ ప్రాక్టీస్ ప్రారంభించాడు.

విద్యార్థి దశలోనే రాఘవ నాటకాలు వేయడం మొదలు పెట్టాడు. షేక్స్‌పియర్ నాటకాలలో వివిధ పాత్రలు అభినయించి, 'షేక్స్‌పీరియన్ నటుడు' అనే బిరుదు పొందాడు.

సంగీతానికి విశేష ప్రాధాన్యం ఇస్తూ ఆంగిక, వాచిక, సాత్త్వికాభినయాలను అంతగా పట్టించుకోని ఆ నాటి తెలుగు నాటక రంగాన్ని సంస్కరించడానికి

---

## ఆనందానికి త్రి సూత్ర పథకం

1. పసిపిల్లవానిలాగ భరోసాతో పూర్తిగా దేవుని మీద ఆధారపడి జీవించు।

2. రోజూ కొంత కాలం మౌనం పాటిస్తూ ఆధ్యాత్మిక చింతన చెయ్యి।

3. కష్టాలలో ఉన్న వారికి చేతనైనంత సహాయపడు।

-దాదా జె.పి. వాస్వానీ

"లోభి వర్షించని వేసవి మేఘం లాంటి వాడు।" —అరబ్బీ సామెత

రాఘవ పూనుకున్నారు. స్త్రీ పాత్రలను స్త్రీలే ధరించాలని ఆయన వాదం. కుల స్త్రీలను కూడా నాటక రంగంలోకి ఆయన ఆహ్వానించారు. దుష్ట పాత్రలను పోషించేటప్పుడు కూడా అసహజంగా, వికృతంగా నటించకుండా మానవత్వంతో సహజంగా నటించాలని ఆయన అభిప్రాయం. ఆ విధంగా ప్రహ్లాద నాటకంలోని హిరణ్యకశిపుని పాత్రకు తన నటన ద్వారా ఆయన నూతన వ్యాఖ్యానం చెప్పారు భగవంతుణ్ణి దర్శించాలని తహతహలాడే ఒక సత్యాన్వేషకుడుగా హిరణ్యకశిపుని పాత్రను ఆయన పోషించారు.

'విజయనగర సామ్రాజ్య పతనం' నాటకంలోని పఠాన్ పాత్ర పోషణలో ఆయన నటన పరాకాష్ఠ చెందింది. అసమాన మైన తన నటనా కౌశలంతో మేనమామ కృష్ణమాచార్యులుగారి నాటకాలను ఆయన ప్రచారంలోకి తీసుకు వచ్చారు. 'సారంగధర' నాటకంలో ఆయన రాజరాజ నరేంద్రుడు, 'రామదాసు' నాటకంలో రామదాసు. బెంగుళూరులోని 'అమెచ్యూర్ డ్రమెటిక్ అసోసియేషన్'లో సభ్యుడుగా చేరి ఆ అసోషియేషన్ తరపున నాటక ప్రదర్శనలు ఇచ్చారు. 'రాఘవ' ప్రదర్శించిన నాటకాలను చూసి ఆయన నటనా ప్రతిభను విశ్వకవి రవీంద్రనాథ్ టాగూరు, మహాత్మా గాంధీ కూడా ప్రశంసించారు.

విద్యార్థికులతో 'ఆర్ట్ లవర్స్ లీగ్' అనే నాటక సంస్థను స్థాపించి చంద్రగుప్త, హరిశ్చంద్ర మొదలైన నాటకాలను ప్రదర్శించారు. డా॥ పి.వి. రాజమన్నారు వ్రాసిన 'తప్పెవరిది?' అనే నాటకాన్ని, తాను స్వయంగా వ్రాసిన 'సరిపడని సంగతులు', 'పిచ్చి దంపతులు' వంటి రచనలనూ ప్రచారంలోకి తెచ్చారు.

1927 లో 'రాఘవ' విదేశాలు సందర్శించి 'ఒథెలో', 'షైలాక్ ది జూ' మొదలైన పాత్రలు అభినయించి విదేశాలలోని ఆ నాటి మేటి నటుల ప్రశంసలు అందుకున్నారు. ఒథెలో పాత్రాభినయం చూసి సుప్రసిద్ధ ఆంగ్ల నాటక కర్త జార్జ్ బెర్నార్డ్ షా

(మిగతా 42 వ పేజీలో)

## ఆఘ మేఘాల మీద పోయే కొత్త రకం రైలు



అయస్కాంత క్షేత్రం మీద పట్టాలకు అంటకుండా పైపైన తేలిపోయే కొత్త రకం రైలును ఇటీవల జపాన్‌లోని మియాజాకి సమీపాన ప్రయోగించి చూశారు. 'దూర నిర్దేశనం' (remote control) తో నడిచే ఈ ఈ రైలు గంటకు 262 కి.మీ. ల వేగంతో పయనించ గలదు.

"ఇతరులు నీకు ఏమి చేయకూడ దని భావిస్తావో, ఇతరులకు నీవు అది చేయకూడదు!" —కన్‌ఫ్యూషియస్

# భారత యోగులు

## మహా భక్తుడు, మహా యోగి

# తులసీదాసు

డా. మను జి. భగత్

సంస్కృత భాషలో రామాయణ మహా కావ్యం వ్రాసిన ఆది కవి వాల్మీకి పేరు వినని వారు ఎవ్వరూ ఉండరు. శతాబ్దాల తరబడి ఇండియాలో వేరు వేరు ప్రాంతాలలో వేరు వేరు భాషలలో అదే రామ కథను తిరిగి తిరిగి వ్రాయడానికి ఆ వాల్మీకి రామాయణం కారణమైంది. అలా వెలసిన వివిధ రామాయణాలలో ఉత్తర భారత దేశంలో తులసీ రామాయణం, తమిళంలో కంబ రామాయణం, అస్సామీస్‌లో మాధవ కందళి, శంకర్‌దేవ్‌ల రామాయణాలూ, బెంగాలీలో కృత్తివాస రామాయణం, మలయాళంలో ఎళుత్తచ్చన్ రామాయణం, తెలుగులో రంగనాథ, భాస్కర, విశ్వనాథ రామాయణాలూ సుప్రసిద్ధాలు.

సాధారణంగా జనం 'తులసీదాసు రామాయణం' అనే వ్యవహరిస్తున్నా నిజానికి ఆ గ్రంథం పేరు 'రామచరిత మానస్' (శ్రీరాముని కథ అనే మానస సరోవరం).




తులసీదాసు

హిందీకి ఒక మాండలికం అయిన 'అవధి' భాషలో ఆ గ్రంథం కూర్చబడింది వాల్మీకి వ్రాసిన సంస్కృత రామాయణం సంస్కృతం వచ్చిన పండితులకు మాత్రమే బోధపడుతూ ఉండడం వల్ల ప్రజ లందరికీ అది అందుబాటులో ఉండా

## ఎరువుగా వేపపిండి విలువ

యూరియాతో కలిపిన వేపపిండి చేలో వేస్తే నత్రజని ఎరువులంత వ్యయం అక్కర లేకుండానే అధిక దిగుబడి సాధించవచ్చు. చెరుకు పంటకు ఆముదపు పిండికంటె, పశువుల పెంట కంటె కూడా వేపపిండి మంచిదని పరిశోధనలవల్ల తేలింది.

"ఏదీ పట్టించుకోని వాడు హాయిగా జీవిస్తాడు!" —జర్మన్ సామెత

లని ప్రజా సామాన్యం మాట్లాడే వాడుక భాషలో తులసీదాసు ఆ కావ్యం వ్రాశారు. తులసీ రామాయణం ఎంతగా ప్రజా జీవితం లోకి ప్రాకిపోయిం దంటే ఇప్పటికీ మారు మూల పల్లెలలో కూడా దసరా పండుగ సంద ర్భంలో దానిని నాటకాలుగా ప్రదర్శిస్తున్నారు. లక్షలాది ప్రజలకు - చదువుకున్న వారికీ, చదువుకోని వారికీ కూడా - ఆయన పాట లెన్నో నోటికి వచ్చు.

క్రీ.శ. 1543 లో ఉత్తర ప్రదేశ్ రాష్ట్రం లోని 'బందా' జిల్లాలో రాజపూర్ గ్రామంలో ఒక సామాన్య బ్రాహ్మణ కుటుంబంలో తులసీదాసు జన్మించాడు. తండ్రి ఆత్మారామ్. తల్లి హులసీ. తులసీదాసుకి చిన్నప్పుడు తల్లి దండ్రులు పెట్టిన పేరు 'రామ్ బోలా.' అతడు మూలా నక్షత్రంలో పుట్టడం అరిష్టం అనీ, 8 ఏళ్ళు వచ్చే లోగా తల్లి దండ్రులు అతని ముఖం చూస్తే కీడు అనీ జ్యోతిష్కులు చెప్పారు. అందుచేత అతని తల్లి 'చూనియా' అనే దాదిచేతి కిచ్చి అతణ్ణి మాతామహుని ఇంటికి పంపించింది. అతనికి 5 ఏళ్ళవయ స్సప్పుడు దాది 'చూనియా' కూడా మర ణించింది. 'రామ్ బోలా' అనాథ అయి బిచ్చ మెత్తుకొని బ్రతుక సాగాడు.

ఒక రోజు 'నరహర్యానంద' అనే ఒక సన్న్యాసి అతనిలోని వర్చస్సును గుర్తించి అతణ్ణి తన వెంట అయోధ్య తీసుకు వెళ్లాడు. ఉపనయనం చేశాడు. ఆ సందర్భంలో గురూపదేశం లేకుండానే అతడు గాయత్రీ మంత్రం పఠించడం అందరినీ ఆశ్చర్య చకితులను చేసింది. నరహర్యానంద చాలా ఆనందించి అతని పేరును 'తులసీ దాసు'గా మార్చాడు.

అనంతరం సుప్రసిద్ధ పుణ్య క్షేత్రం, విద్యా కేంద్రం అయిన కాశీ నగరానికి ఆ సన్న్యాసి తులసీ దాసును పంపించాడు. 15 ఏళ్ళ పాటు మహా భక్తుడూ, యోగీ అయిన శేష సనాతన్ అనే పండితుని వద్ద తులసీ దాసు వేదాలూ, పురాణాలూ మొదలైన ప్రాచీన గ్రంథా లన్నీ అధ్యయనం చేశాడు. గురువు గారు పరమపదించిన తరువాత తులసీదాసు

---

## మంచి దస్తూరికి రాచబాట



ఆఖెన్ (ప. జర్మనీ) లోని మాజీ మన శ్శాస్త్రాచార్యుడు ఫ్రెడరిక్ స్టీన్ వాచెస్ జరి పిన సర్వే ఫలితంగా పలక, బలపం వాడడం వల్లనే చక్కని దస్తూరీ అలవడ గల దని విశదమైంది. మొదట పలక, బలపంతో వ్రాయడం నేర్చుకొన్న వారు తరువాత ఫౌంటెన్ పెన్‌తో కూడా బాగా వ్రాయగలుగు తున్నారు.

('జర్మన్ ట్రిబ్యూన్' సౌజన్యంతో)

"అప్పు తీసుకొన్న వాడి కంటె అప్పిచ్చిన వాడికే జ్ఞాపకశక్తి ఎక్కువ." —బెంజమిన్ ఫ్రాంక్లిన్

తన గ్రామం తిరిగి వచ్చి, అక్కడ స్థానిక శివాలయంలో అర్చకుడుగా కుదిరాడు. 'రత్నావళి' అనే ఆమెను వివాహ మాడాడు. వారికి ఒక కుమారుడు కలిగాడు. కాని చిన్న తనంలోనే చనిపోయాడు.

తరువాత ఆయన జీవితం ఒక పెద్ద మలుపు తిరిగింది. ఆయనకు తన భార్య అంటే విపరీతమైన మక్కువ. ఒక రోజున ఆయన అనుమతి లేకుండా ఆమె పుట్టింటికి వెళ్ళింది. ఆయనకు పిచ్చెత్తినట్టై అర్ధ రాత్రికి అర్ధ రాత్రి మధ్యలో ఉన్న నదిని ఈదుకుంటూ వెళ్ళి ఆమెను నిద్ర లేపాడు. ఆమె నిర్ఘాంతపోయి ఆయనను ఇలా మంద లించింది: "ఏమిటి ఈ నా శరీరం మీద మీ కింత వ్యామోహం? మాంసం కప్పి ఉన్న వట్టి ఎముకల గూడు ఈ శరీరం! దీని మీద చూపే మక్కువలో సహస్రాంశం శ్రీరాముడి మీదికి మళ్ళిస్తే మీ జీవితం ధన్యం అవు తుంది!" ఆ మాటలు ఆయనకు కళ్ళు తెరి పించాయి. తన భార్యనే తనకు గురువుగా భావించాడు. సంసారం వదలి కాశీ వెళ్ళి రామనామం జపిస్తూ తపస్సు చేయ సాగాడు. ప్రతి సాయంత్రం దశాశ్వమేథ ఘాట్‌కి వెళ్ళి అక్కడ జరిగే రామాయణ కాలక్షేపం వినేవాడు. అక్కడ ఆయన కొక వృద్ధుడు తటస్థ పడ్డాడు. ఆ వృద్ధుడు వే రెవరో కాదు, సాక్షాత్తు హనుమంతుడే! ఎలాగైనా ఒక్కసారి శ్రీరామచంద్రమూర్తి ని దర్శించా లని తను తహతహలాడు తున్నట్టు తులసీ దాసు ఆ వృద్ధునితో అన్నాడు. చిత్రకూట పర్వతానికి వెళ్ళవలసిం దని ఆ వృద్ధుడు ఆయనకు సలహా ఇచ్చాడు.

చిత్ర కూటం వెళ్ళి తులసీదాసు మరింత కఠోరమైన తపస్సు కొనసాగించాడు. ఒక నాడు రామనామం చేస్తూ ఒళ్ళు తెలియకుండా ఉన్న సమయంలో కళ్ళు తెరిచి చూసే సరికి ఎదురుగా కాశీలో తనకు పరిచయమైన ఆ వృద్ధుడు కనిపించాడు. చూస్తూ ఉండగానే ఆయన హనుమంతుడుగా మారిపోయి తానే వృద్ధుని రూపంలో వచ్చా నని చెప్పాడు.

## మిక్కిలి ప్రశస్తమైన కళ!




"రాతిలో సజీవమైన విగ్రహం చెక్కడం, కాన్వాస్‌మీద కొన్ని రంగులతో జీవకళ ఉట్టి పడేట్టు బొమ్మ చిత్రించడం నిస్సందేహంగా గొప్ప కళలే! కాని, మన జీవన విధానం ద్వారా మన పరిసరాల స్వరూపమే మార్చి వేసి, మన చుట్టూ ఉన్న వారికి ఆనందాన్ని సమకూర్చే కళ అన్ని కళలలోకీ మరింత ప్రశస్తమైన కళ!"

—హెన్రీ థోరో

"వివేకశూన్యు డైన మిత్రుడు
వివేకవంతు డైన శత్రువుకంటె ప్రమాదకరం!" —షేక్స్‌పియర్

తులసీదాసు ఆనందానికి అవధులు లేవు. ఎలాగైనా తనకు శ్రీరాముని దర్శనం చేయించ మని హనుమంతుణ్ణి ఆయన వేడుకున్నాడు. అప్పుడు హనుమంతుడు తారక మంత్రం ఉపదేశించాడు.

ఒక రోజున తులసీ దాసు స్వామి కోసం చందనం తీస్తున్నాడు. రామ నామం చేస్తూ దాని కనుగుణంగా లయాత్మకంగా సాన మీద తన చేతులు కదుపుతున్నాడు. ఉన్నట్టుండి ఎదురుగా జడలు కట్టిన తలతో, నార చీరలతో, చేత ధనుస్సుతో, దివ్య దరహాసంతో భువన మోహనుడైన ఒక యువకుడు దర్శనం ఇచ్చాడు. ఆయనే శ్రీరామచంద్ర ప్రభువని తులసీ దాసు పోల్చుకున్నాడు. ఆ చందనం తన నదుట పెట్టమన్నాడు శ్రీరాముడు. ప్రభువు స్పర్శతో తులసీదాసు శరీరంలో దివ్య శక్తులు వెల్లివిరిశాయి.

తులసీదాసుకి పూర్తి జ్ఞానోదయం అయింది తన జీవిత ధ్యేయం అర్థమైంది. ఆ ధ్యేయం సాధించడానికి ముందు ఉత్తర, దక్షిణ భారత దేశాలలోని పుణ్య క్షేత్రాలు తిరిగి వచ్చాడు. చివరికి అయోధ్యలో స్థిరపడి 1574 మార్చి 31 న 'రామచరిత మానస్' వ్రాయడం మొదలు పెట్టాడు. ఆ కావ్యం వ్రాయడానికి ఆయనకు 2 ఏళ్ళ 7 నెలల 26 రోజులు పట్టింది. కవితా దృష్ట్యా, మత దృష్ట్యా కూడా అది ఉద్ గ్రంథంగా గుర్తించబడింది. ఆ కావ్యం మత, వర్ణ, లింగ విచక్షణ లేకుండా ప్రజ లందరికీ శ్రీరామ చంద్రుణ్ణి ఇష్ట దైవాన్ని చేసింది.

క్రమంగా తులసీ దాసు కీర్తి దేశం నలుమూలలకూ ప్రాకింది. పండితులూ, పామరులూ, ధనికులూ, నిర్ధనులూ - అందరూ ఆయన దర్శనానికి విరగబడడం మొదలు పెట్టారు. తులసీ దాసు అభిమానులలో అంబర్ రాజు రాజా మానసింగ్, తోడర్‌మల్లు, మధుసూదన సరస్వతి ముఖ్యులు. తమ సంస్కృత పాండిత్యంతో పొట్ట పోసుకుంటున్న ఛాదస్తపు పండితులు మాత్రం కొందరు ఎలాగైనా ఆయనను అవమాన పరచాలనీ, వీలైతే హత్య చేయాలనీ కూడా ప్రయత్నించారు. కాని, శ్రీరాముడు నిరంతరం ఆయనకు బాసటగా నిలబడ్డాడు.

రామభక్తి ప్రచారం అనే తన జీవిత లక్ష్యం ముగించి, 1623 లో తన 80 వ ఏట అస్సీ నదీ తీరాన తులసీదాసు సిద్ధి పొందాడు.

## 'ఫ్లామింగో' పక్షుల వేసవి మకాం



ప్రతి వేసవిలోనూ కాషీరంగు 'ఫ్లామింగో' పిట్టలు ఆఫ్రికా నుంచి రష్యాలోని కజక్‌స్థాన్‌లో ఉన్న 'కుర్గాల్జిన్', 'టెంగిజ్' సరోవరాలకు వలసపోతాయి. అక్కడ అవి గుడ్లుపెట్టి పొదిగి ఆ చిన్న పిట్టలతో సహా స్వదేశం తిరిగి వస్తాయి.

"డబ్బు దొరకకముందే దాన్ని ఖర్చుచేయకు!" —థామస్ జెఫర్‌సన్

# గుండె జబ్బుతో 30 ఏళ్ళు

డా॥ ఎస్. జగన్నాథన్



[1943 మొదలు 1946 దాకా డా॥ ఎస్. జగన్నాథన్ రెండో ప్రపంచ సంగ్రామ కాలంలో మిలిటరీ డాక్టర్‌గా పనిచేశారు. తరువాత 1964లో రిటైర్ అయేదాకా అనేక ప్రభుత్వాసుపత్రులలో అనేక శాఖలలో స్పెషలిస్టుగా పనిచేశారు. రిటైర్ అయిన తరువాత కొంతకాలం రామకృష్ణ మిషన్ ఉచిత వైద్యశాలలో రోగులకు సేవ చేశారు.]

గుండె జబ్బులను గురించి పత్రికలలో తరచు మనం చదువుతూ ఉంటాం. వెనుకటి కంటె గుండె జబ్బుతో బాధపడే రోగుల సంఖ్య ఈ నాడు పెరిగింది. దేశంలో వివిధ ప్రదేశాలలో హార్ట్ స్పెషలిస్టుల సమావేశాలు జరగడం ఎక్కువైంది.

1981 లో గుండె జబ్బుల నిరోధానికి, ఆ వ్యాధి వచ్చిన రోగుల పునరావాసానికీ కృషి చేసే 'నేషనల్ సొసైటీ' సమావేశం ఒకటి బొంబాయిలో జరిగింది. చాలా రోజులుగా గుండె జబ్బుతో తీసుకొంటున్న కొందరు రోగులను కూడా ఆ కాన్ఫరెన్సుకి వారు ఆహ్వానించారు. అలా హృద్రోగంతో బాధ పడుతున్న ఒక రోగిగా నేను ఆ కాన్ఫరెన్సుకి వెళ్ళి, అక్కడ నా అనుభవాలు వారికి చెప్పాను. ఆ సందర్భంలో .... తీవ్రంగా గుండెపోటు వచ్చిన తరువాత 30 ఏళ్ళపాటు నా ఆరోగ్యాన్ని సక్రమంగా కాపాడుకోగలిగినందుకు గాను నాకు ఒక వెండి మెడలూ, ఒక ప్రశంసా పత్రం బహూకరించారు.

నా 'గుండెజబ్బు' ను గురించిన చరిత్ర,

---

## మడత స్కూటరు

క్రిమియా (రష్యా) లోని సింఫెరో పోల్ వాస్తవ్యుడు వ్లాడిమిర్ ఆబ్రమోవ్ - మడిచి సంచీలో పెట్టి బస్సులో గాని, రైలులో గాని తీసుకు వెళ్ళడానికి వీలైన క్రొత్త రకం స్కూటర్ నమోనా ఒకటి తయారు చేశారు. 28 కి.గ్రా. లు బరువుండే ఈ స్కూటరు మీద డ్రైవరు కాక మరి ఇద్దరు ఎక్కవచ్చును. గంటకు సుమారు 40 కి.మీ. ల వేగంతో పోతుంది.

"మనిషి వ్యక్తిత్వానికి బాల్యమే పునాది." —రూజ్వెల్ట్

నా అనుభవాలు ఇక్కడ సంగ్రహంగా వివరిస్తాను:

1950 లో నా 41 వ ఏట నాకు మొట్ట మొదటి సారి 'హార్ట్ ఆటాక్' వచ్చింది. ఆ తరువాత 49 వ ఏట (1958 లో) ఒక సారీ, 53 వ ఏట (1962 లో) ఒక సారీ హార్ట్ ఆటాక్ రావడం జరిగింది. ఆ 'అటాక్' వచ్చినప్పుడు 5, 6 వారాల పాటు మంచాన బడడం తప్ప, తక్కిన కాలం అంతా మామూలు మనిషిలాగ ఆరోగ్యంగా జీవిస్తూ యథాశక్తి నా రోగులకు సేవచేస్తూ వచ్చాను.

ఆరోగ్యం కాపాడుకోడం కోసం నేను కొన్ని ఆహార నియమాలు పాటించాను. మధ్యాహ్నం ఒక్కసారే భోజనం చేస్తాను. అన్నం, కూరలు, మజ్జిగ తీసుకుంటాను. రాత్రి పూట 4 చపాతీలూ, ఉడకబెట్టిన కూరలూ తింటాను. నూనె వేపుళ్ళు ఇంచుమించు పూర్తిగా పరిహరించాను. ఆకు కూరలు ఎక్కువగా తీసుకుంటాను.

హృద్రోగం వచ్చిన వారికి సెక్స్ పూర్తిగా నిషిద్ధం కాదు. 'అతి' లేకుండా సాధారణమైన సంసార సౌఖ్యం అనుభవించవచ్చు.

గుండెజబ్బుతో బాధపడే వారు క్రమమైన అలవాట్లు పాటించడం అవసరం. అన్నిటి కంటె ముఖ్యం - చీకూ, చింతా లేకుండా మనస్సును నిర్మలంగా ఉంచుకోడం। అలసట కలుగని విధంగా తమ తమ వృత్తులు వారు కొనసాగించవచ్చును.

ఇటీవలి రిపోర్ట్ల ప్రకారం ఏ కేసు కా కేసు విడివిడిగా పరీక్షించి, రోగిని దీర్ఘంగా ప్రశ్నించి గాని, శారీరకమైన అతని హృద్రోగానికీ, అతని లైంగిక ప్రవర్తనకీ మధ్య ఉండే సంబంధాన్ని నిర్ణయించడానికి వీలు లేదని స్పెషలిస్ట్లు భావిస్తున్నారు.

నా అనుభవంలో రోగి తన లైంగిక వాంఛను తగ్గించుకోడానికి భార్య సహకారం, సంఘంలో అంతస్తు, సంకల్ప బలం, మనస్సును ఇతర వ్యాపకాలవైపు మళ్ళించడం వంటివి సహాయం చేస్తాయి.

రోజూ ప్రొద్దున్నే నేను ఒక మైలుదూరం నడుస్తాను. తరువాత తేలికైన కొన్ని ఆసనాలు వేసి, ప్రాణాయామం చేస్తాను. ఆ తరువాత గాని కాఫీ తీసుకోను.

(మిగతా 35 వ పేజీలో)

## విమాన యానంలో కొత్త రికార్డు



25 ఏళ్ళ వయస్సుగల విమాన చోదకుడు మార్గ్రిట్ ఆర్లొస్కీ ఒకే ఇంజనుగల విమానాన్ని న్యూ ఫౌండ్‌లాండ్ (కెనడా) లోని 'గాండర్' నుంచి ప. జర్మనీలోని 'కొలోన్' దాకా 4,294 కి.మీ.ల దూరం ఏకధాటీని గం. 12-51 ని. లలో నడిపించి, ఆ విషయంలో క్రొత్త రికార్డు స్థాపించాడు.

"మనిషి ఎప్పుడూ కోరరానిదే కోరుతాడు." —సైరస్

# జాతీయ వార్తలు

## పెండలం నుంచి సారాయి:

మైసూరులోని 'సెంట్రల్ ఫుడ్ అండ్ టెక్నలాజికల్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్' వారు పెండలం (tapioca) నుంచి సారాయి తయారు చేసే ప్రక్రియను కనిపెట్టారు. కిలో 50 పై. ల చొప్పున పచ్చి పెండలం దుంపలు కొంటే, ఈ సారాయి తయారు చెయ్యడానికి లీటర్‌కి రూ. 7 లు ఖర్చు అవుతుంది. ఎండిన పెండలం నుంచి కూడా ఈ సారాయి తయారు చేయవచ్చునట!

* * *

## ప్రపంచ ఆరోగ్య సంస్థలో ఉన్నత స్థానంలో ఇండియన్:

సుప్రసిద్ధ వైద్య నిపుణుడూ, 'ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రీసెర్చ్' అధ్యక్షుడూ అయిన డా॥ వి. రామలింగ స్వామిని ఇటీవల ప్రపంచ ఆరోగ్య సంస్థ వారు జెనీవాలోని తమ 'వైద్య పరిశోధన అంతర్జాతీయ సలహా సంఘం' అధ్యక్షుడుగా నియమించారు. ప్రపంచ ఆరోగ్య సంస్థలో ఇలాంటి ఉన్నత పదవి అందుకున్న తొలి భారతీయుడు ఈయనే!

* * *

## 142 ఏళ్ల వృద్ధుని అస్తమయం:

కొచ్చిన్ (కేరళ) కు చెందిన 'శతవృద్ధు' మార్గాన్ తన 142వ ఏట ఇటీవల చనిపోయాడు. జీవితంలో ఎక్కువ భాగం అతడు తలమీద బరువులు మోసే కూలీగా పనిచేశాడు. ఏం దొరికితే అదే తింటూ, హాయిగా చన్నీళ్ళ స్నానం చేస్తూ అన్నేళ్ళు అతడు జీవించాడు అతనికి 6 గురు భార్యలూ, 27 గురు పిల్లలూ, ఎందరో మనుమలూ, మనుమరాళ్ళూ ఉన్నారు.

## సుదీర్ఘమైన ఇండియన్ నవల



ఇండియాలో వివిధ భాషలలో వెలువడిన నవల లన్నిటిలో మిక్కిలి పెద్దది 'విలాసిని' అనే కలంపేరుతో ఎమ్ కే. మీనన్ వ్రాసిన 'అవకాశిగళ్' (హక్కుదారులు) అనే మలయాళం నవల. 10 ఏళ్ళ పాటు ఆయన శ్రమించి వ్రాసిన ఆ నవల 3,958 పుటలతో 4 సంపుటాలుగా వెలువడింది. 1981 సాహిత్య అకాడమీ అవార్డు అందుకుంది

"మనిషి చర్యలే అతని ఆలోచనలను సూచిస్తాయి." —లాక్

## మందులలో 17.5 శాతం నాసి రకం :

1978 నుంచి 1981 దాకా మందుల నమోనాలను టెస్ట్ చేసిన కలకత్తాలోని 'ది సెంట్రల్ డ్రగ్ లేబొరేటరీ', ఘాజియాబాద్ (ఉ.ప్ర)లోని 'ది సెంట్రల్ ఇండియా ఫార్మా లేబొరేటరీ' మన దేశంలో తయారుచేసి అమ్ముతున్న ఔషధాలలో సుమారు 17.5 శాతం నాసిరకాని వని ప్రకటించాయి.

## విమానాశ్రయాలలో స్వయంగా మాట్లాడే టెలిఫోన్‌లు :

ఢిల్లీ, బొంబాయి, కలకత్తా, మద్రాసు, బెంగుళూరు, హైదరాబాద్ వంటి మన ప్రధాన విమానాశ్రయా లన్నిటిలో రింగ్ చెయ్యగానే తమంతట తామే విమానాల రాక పోకల వేళలను తెలియజేసే టెలిఫోన్‌లు ఏర్పాటు చేస్తున్నారు.

* * *

## బేటరీతో నడిచే కొత్త సైకిల్ :

బెంగళూరుకి చెందిన ఒక యువక ఇంజనీరు అనిల్ అనంతకృష్ణ 'విద్యుత్ - 24' అనే బాటరీతో నడిచే కొత్త రకం సైకిల్ నమోనా తయారు చేశాడు. ఈ సైకిల్‌కి సుమారు రూ. 6,500 లు ఖర్చు అవుతుంది. కాని, ఇంధనం ఖర్చు కి.మీ.కి 5 పైసలు మాత్రమే! దీనిలోని అయస్కాంతపు డీ.సి. మోటార్ ఒక్కటే అమెరికా నుంచి దిగుమతి చేసుకుంటారు. తక్కిన భాగా లన్నీ ఇండియాలో తయా రయ్యేవే!

* * *

## ప్రసిద్ధ పురాతత్త్వవేత్త అస్తమయం :

ప. బెంగాల్‌లో దాదాపు 100 ప్రాచీన స్థలాలలో త్రవ్వకాలు జరిపించిన సుప్రసిద్ధ పురాతత్త్వ శాస్త్రజ్ఞుడు ( archaeologist ) పి.సి. దాస్ గుప్త దీర్ఘకాలం వ్యాధితో బాధ పడి ఇటీవల పరమపదించారు.

## వార్తా పత్రిక లక్ష్యాలు



"వార్తా పత్రిక తాలూకు ఒక లక్ష్యం: ప్రజాసామాన్యపు భావాలను గుర్తించి వాటిని ప్రకటించడం. మరోటి: కోరదగిన మంచి భావాలను ప్రజలలో రేకెత్తించడం. మూడోది: నిర్భయంగా ప్రజల లోపాలను ఎత్తి చూపడం!"

—మహాత్మా గాంధీ

"మతము లన్నియు మాసిపోవును;
జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును!" —గురజాడ

# మాపతలు

మే 1983

**శ్రీమతి పి. భానుమతి రామకృష్ణ**

ధరణికోట అనసూయమ్మ, నెల్లూరు.

“కుల వృత్తికి సాటి ఏది? గువ్వల చెన్నా!” అన్నారు - ఈ నాడు అందరూ ఉద్యోగాల కోసం ఉరుకులు పెడతా రెందుకని?” (ఉత్తమ ప్రశ్న)

* పర రాజ్యపాలనలో అయిన అలవాట్లు వదలక!

* * *

వి. వి. కృష్ణ, ఆదిలాబాద్.

“మీ దృష్టిలో ఏది గొప్పది - కవిత్వమా? సంగీతమా?”

* నా దృష్టిలోనే కాదు. భారతీయు లందరి దృష్టిలోనూ ఆ రెండూ సరి సమానమైన విలువ గలవి. సంగీత. సాహిత్యాలను సరస్వతీదేవి స్తనద్వయంతో పోల్చారు.

* * *

ఎస్. ఏ. దర్శన్ రెడ్డి, భోరంపేట.

“జీవితంలో సర్వస్వం కోల్పోయినా ఒకటి మాత్రం మిగిలి ఉంటుంది - అదేమిటి?

* ‘భవిష్యత్తు!’ అవునా?

స్నేహశీలి, రాజాం.

“మీకు రాము డంటే ఇష్టమా? కృష్ణు డంటే ఇష్టమా?”

* ‘రామకృష్ణ’ అంటే ఇష్టం. చాలా?

* * *

## ఆత్మకు నాశనం లేదు



“ఆత్మకు నాశనం లేదు అనీ. అది శాశ్వతం అనీ నాకు పూర్తిగా నమ్మకం కుదిరింది. రాత్రిపూట మనకు కనిపించకుండా పోతున్న సూర్యుడు మరో చోట ప్రకాశిస్తూనే ఉంటాడు గదా! ఆత్మ కూడా ఆ సూర్యుడి లాంటిదే!”

— గెయిథే

“ధైర్యానికి గొప్ప పరీక్ష - అపజయాన్ని సంతోషంగా స్వీకరించగలగడం!” - రాబర్ట్ గ్రీన్ ఇంగర్ సోల్

ఎం.వి. అరుణకుమార్, బొంబాయి.

"సినీమా రంగం వల్ల నాటకరంగం దెబ్బ తిన్న దంటాను - మీరే మంటారు?"

* ముందు ముందు టీ.వీ., వీడియోల్లాంటి వాటివల్ల సినీమా రంగం కూడా దెబ్బతిన బోతూం దంటాను.

* *

యు.యు.ఉరుకుందు, ఎమ్మిగనూరు.

"తొమ్మిదవ ఆసియా క్రీడోత్సవాలవల్ల మన దేశానికి మిగిలిం దేమిటి?"

* పరువు ప్రతిష్ఠలు! అలాంటి అంతర్జాతీయ ఉత్సవాలు జరిపే ఉన్నత స్థాయికి మన దేశం ఎదిగిం దని రుజువైంది.

* * *

జి. మల్లినాయుడు, జానుమల్లువలస.

"మనిషిలో దురాశ ఎప్పుడు నశిస్తుంది?"

* ఉన్నదానితో తృప్తిపడి హాయిగా జీవించ గలిగినప్పుడు!

* * *

వై. శివచంద్రబాబు, రాజమండ్రి.

"ఎవర్నడిగినా జీవితం చిక్కు ప్రశ్న అంటారు - ఈ చిక్కు ప్రశ్నకు జవాబేమిటి?"

* భగవద్ విశ్వాసం. విశ్వాసం గల వారికి జీవితం నందనవనం అవుతుంది.

* * *

కె. వెంకటరమణ, బరంపురం.

"చిత్ర సీమలో పాతవాళ్ళ బంధువులకూ, స్నేహితులకూ తప్ప ఇతర కళాకారులకు అవకాశ ముండదా?"

* ప్రభుత్వ పదవుల్లాగే ఇవీ వారసత్వం అయిపోతున్నాయి. అందుకే చిత్ర పరిశ్రమ 'నా నాటికి తీసికట్టు....'

* * *

పసుమర్తి రుక్మిణీ సత్యనారాయణ, ఒంగోలు.

"అన్ని రంగాలలో స్త్రీలు ముందడుగు వేస్తున్నా కొన్ని దేశాలలో ఇంకా స్త్రీలు బురఖాలు తగిలించుకొని అంధకారంలో అలమటిస్తున్నారు - వీరికి విముక్తి ఎప్పుడు?"

## వారానికి రెండు రోజులు ఉపవాసం ఉండే కుక్క



బీహార్‌లోని టాటా నగర్ కాపురస్థుని పెంపుడు కుక్క 'తీపు' రొట్టె, బిస్కట్లు వంటి శాకాహారం తప్ప, చేపలు వగైరా మాంసాహారం ముట్టుకోదు. వారానికి రెండు రోజులు - మంగళ, శని వారాలు - ఉపవాసం ఉంటూంది. ఈ వింతను చూసి చుట్టుపట్ల జనం ఆశ్చర్యపోతున్నారు.

"ప్రతి వ్యక్తి పరిశీలించేది ఎదుటి వ్యక్తి చేసే పొరపాట్లనే! —డ్రెయిడెన్

* మత రాజ్య పద్ధతి అంతరించినప్పుడు!

* * *

ఎన్. కామేశ్వరరావు, సికింద్రాబాద్.

"ఏ స్త్రీకైనా ఉండే 'మతి' కంటే మీకు రెండింతలు 'మతి' ఉందంటాను - మీరే మంటారు!"

* రెండోది పేరులో ఉన్న 'మతి'. అది వట్టి నేతిబీరకాయ నాయనా!

* * *

ఎన్. ప్రకాష్ రావు, జే. కే. పూరు.

"మన దేశంలో వంశ పారంపర్య పరిపాలనకు అంతం ఉన్నదా? లేదా?"

* ఆరంభం ఉన్న ప్రతిదానికీ అంతమూ ఉంటుంది. దేనికైనా సమయం రావాలి!

* * *

జి. సాంబశివరావు, తెనాలి.

"మన బ్రతుకులే లాటరీ లాంటివని తెలిసి కూడా లాటరీలు నిర్వహించే మన ప్రభుత్వాలను ఏ మనాలి?"

* జీవితమే ఒక నాటకరంగం అని తెలిసి కూడా నాటకాలు వేసేవారినీ, సినిమాలు తీసేవారినీ ఏ మనాలో అదే అందాం!

## మానవ శరీరంలో పదివేల కోట్ల కణాలు

మానవ దేహంలో సుమారు 200 రకాలకు చెందిన పదివేలకోట్ల జీవ కణాలు(cells) ఉంటాయి. వీటిలో 1,200 కోట్ల జీవ కణాలు ఒక్క మెదడులోనే ఉంటాయి.

పి. చంద్రశేఖర ప్రసాద్, కాశీబుగ్గ.

"రాజకీయ నాయకులూ, మహానుభావులూ గుండె పోటుతో మరణించడానికి కారణం?"

* హార్టు స్పెషలిస్టులకే ఇంకా అంతు పట్టని రహస్యం అది!

## భార్యా, భర్త లిద్దరికీ నోబెల్ బహుమతి



80 ఏళ్ళ స్వీడిష్ మహిళ ఆల్వా మిర్డాల్‌కీ, మెక్సికో మాజీ విదేశాంగ మంత్రి ఆల్ఫాన్సో గార్షియా రోబల్స్‌కీ కలిపి 1982 నోబెల్ శాంతి బహుమతి ఇచ్చారు. ఆల్వా మిర్డాల్ భర్త స్వీడిష్ అర్థశాస్త్ర నిపుణుడు గున్నార్ మిర్డాల్ 1974 లోనే ఎఫ్. వాన్ హాజెక్‌తో పాటు అర్థశాస్త్రంలో నోబెల్ బహుమతి గెలుచుకున్నారు. భార్యాభర్త లిద్దరికీ వేర్వేరు రంగాలలో నోబెల్ బహుమతి లభించడం ఇదే ప్రథమం!

ఆల్వా మిర్డాల్ 1981 జవహర్‌లాల్ నెహ్రూ అవార్డు కూడా అందుకుంది.

"చెప్పిన వేళకు రానివాడు కాలం విలువ తెలియని వాడు: అతడు నీతిమంతు డంటే నమ్మకండి!" —ఎమ్మెన్స్

# బహుమతి పొందిన వ్యాసం

(ఫిబ్రవరి 1983)

# ఇండియాలో జాతీయ సమైక్యం సాధించడం ఎలా?

పి.ఆర్.మండేశ్వరరావు, రాజమండ్రి.

వివిధ సంస్కృతులూ, సంప్రదాయాలూ, భాషలూ, మతాలూ ఉన్న భారతదేశంలో జాతీయ సమైక్యానికి అత్యంత ప్రాధాన్యం ఇవ్వవలసి ఉంటుంది. జాతీయ సమైక్యం సాధించాలంటే ముందుగా కోట్లాది ప్రజలను ఒక్క త్రాటిమీద నడిపించగల నాయకత్వం అవసరం. కుల, మత, ప్రాంతీయ తత్వాలకు అతీతుడైన స్వార్థ రహితుడు నాయకుడు కావడం దేశ సమైక్యానికి విశేషంగా తోడ్పడ గలదు.

ప్రాంతీయ తత్త్వం దేశ సమైక్యానికి హానికరం. దేశంలోని అన్ని ప్రాంతాలకూ, అన్ని వర్గాల ప్రజలకూ సమా నావకాశాలు కల్పించడం ద్వారా ప్రాంతీయ తత్త్వాన్ని నిర్మూలించాలి. 'ఖాలిస్థాన్' ఉద్యమం వంటి వేర్పాటు ఉద్యమాల పట్ల ప్రభుత్వం ఏ మాత్రం సానుభూతి చూపవలసిన అవసరం లేదు. దేశంలో ఎక్కడ కుల, మత, ప్రాంతీయ తత్త్వాలు తల ఎత్తినా, నిర్దాక్షి

## అమెరికాలో మిక్కిలి అందమైన భవనం



వాషింగ్టన్ డి.సి లో అమెరికా అధ్యక్షుడు నివసించే వైట్ హౌస్ అమెరికా అంతటి లోకీ అందమైన భవనం. జేమ్స్ హూబిన్ తయారు చేసిన నమూనాను అనుసరించి 1792 లో దానిని నిర్మించారు. అయితే 1812 యుద్ధంలో అది కాలిపోగా 1818 లో దానిని పునర్నిర్మించారు. 7 హెక్టేర్ల చక్కని ఆరామం మధ్యలో ఉన్న ఆ భవనంలో 132 గదు లున్నాయి. క్రింది అంతస్తులోని 5 పెద్ద హాలులను మాత్రమే ప్రజలు చూడవచ్చు. ఏటా 10 లక్షల మంది టూరిస్టులు వైట్ హౌస్‌ను సందర్శిస్తున్నారు.

"ఆలోచించలేని వారికి ఆనందం కలిగించేవి వినోదాలే." —పోప్

ణ్యంగా వాటిని అణచివేసి ప్రభుత్వం దేశ సమైక్యానికి భంగం ఏర్పడకుండా చూడాలి.

ఇండియాలో దేశ సమైక్యానికి భంగం కలిగించే విషయాలలో మతం అత్యంత ప్రధానమైంది. ప్రభుత్వం సెక్యులర్ విధానాలను కచ్చితంగా అమలు జరుపుతూ మతతత్వాన్నీ, మత కలహాలనూ నిర్దాక్షిణ్యంగా అణచివేయాలి. మత ప్రాతిపదిక మీద పని చేసే రాజకీయ పక్షాలను నిషేధించాలి.

దేశ సమైక్యాన్ని సాధించడానికి తోడ్పడే మరో ముఖ్యమైన అంశం: భాష. హిందీ, తమిళ భాషల మధ్య ఏర్పడిన ఘర్షణ మనకు తెలియంది కాదు. ఇతర భాషలవారిమీద హిందీని బలవంతంగా రుద్దే ప్రయత్నం విరమించి అన్ని దేశ భాషలకూ సమానమైన ప్రాధాన్యం ఇవ్వాలి.

* * *

కె. శ్రీనివాసులు, తనకల్లు.

1962 లో భారత జాతీయ సమైక్య సమితి ఏర్పాటైంది. అయినా ఆ సమితి కృషి విశేషంగా ఫలించినట్లు లేదు. నేడు మన దేశం ఎదుర్కొంటున్న గొప్ప ప్రమాదం మత విద్వేషం. దేశంలో విభిన్న ప్రాంతాలలో తిరిగి మత కలహాలు తల ఎత్తుతున్నాయి.

జాతీయ సమైక్యానికి మరొక తీవ్ర ప్రమాదం అసమానతల అస్తిత్వం. భారతీయు లందరూ భారత దేశంలోని ఏ ప్రాంతాలకు వెళ్ళినా నిర్భయంగా అక్కడ పని చేసుకొని జీవించగలిగే అవకాశం ఉండాలి.

ఏ సమస్య అయినా మనిషి మనస్సులోనే మొలకెత్తుతుంది. మనం చదివే పుస్తకాలూ, వినే రేడియో కార్యక్రమాలూ, చూసే సినీమాలూ మన మనస్సులను కలవరపరచేవిగా ఉండకూడదు. సమైక్య సంఘటనకే అవి దారి తీయాలి. మన మాజీ రాష్ట్రపతి డా. రాధాకృష్ణన్ ఇలా అన్నారు: "భారతీయుడు అంటే కేవలం మన దేశంలో జన్మించిన వాడు మాత్రమే కాదు. యుగ యుగాలుగా భారతదేశం ఏ ఆశయాలకూ, ఆదర్శాలకూ

## మిక్కిలి సుఖంగా ఉండే జైలు




యూరప్‌లోని స్వీడెన్ దేశంలో జైలు జీవితం మిక్కిలి సుఖంగా ఉంటుంది. ఆ దేశంలో జైళ్ళన్నీ పూర్తిగా నిండిపోయాయి. ప్రస్తుతం తూర్పు తీరాన ఉన్న సుండ్స్‌వాల్‌లో 10 మంది ఖైదీలను హోటల్‌లో భోజనం, బస ఏర్పాటుచేసి, కారులో రోజా జైలుకి తీసుకు వెళుతున్నారు.

"అలవాటును కిటికీలో నుంచి ఒక్క సారిగా విసిరి వేయలేము; బుజ్జగిస్తూ మెట్లమీద నుంచి మెల్లగా సాగనంపాలి!" —మార్క్ ట్వైన్

కట్టుబడి ఉందో, ఆ విలువలను విశ్వసించే ప్రతివాడూ భారతీయుడే!

* * *

వై. భాస్కర్, గజ్వేల్ (మెదక్ జిల్లా).

భారతదేశంలో అనేక కులాలవారూ, మతాలవారూ, వివిధ భాషలు మాట్లాడేవారూ, విభిన్న సంస్కృతులు కలవారూ ఉన్నారు. ప్రాంతీయ భేధాలు ఎన్ని ఉన్నా మనం అంతా భారతీయులమే అనే భావన అందరిలోనూ ఉండాలి. భిన్నత్వంలో ఏకత్వం సాధించడం మన సంస్కృతికి ప్రధాన లక్ష్యం.

జాతీయ సమైక్యం నెలకొనా లంటే మన దేశ ప్రజలలో ముందుగా భావాత్మకమైన సమైక్యం ఏర్పడాలి. అందరూ 'భారతదేశం నా మాతృభూమి' అని గర్వపడాలి. ఇచ్చట ప్రవహించే నదులు అన్నీ అందరికీ పవిత్రమైనవే! హిమాలయాలు అందరివీ. దేశంలోని అడవులూ, వృక్షసంపద, పరిశ్రమలు దేశంలోని ప్రజ లందరికీ చెందినవి. ఈ విధంగా 'నాది' అనే భావం పోయి. 'మనది' అనే భావం అందరిలోనూ కలగాలి.

పూర్వం ఆదిశంకరాచార్యులవారు తమ అద్వైత సిద్ధాంతాన్ని దేశం అంతటిలో ప్రచారం చేసి ఉత్తర, దక్షిణ భారతీయులను ఒకే త్రాడుమీద నడిపి జాతీయ సమైక్యాన్ని సాధించారు. కాశీ, బదరీనాథ్, తిరుపతి మొదలైన పుణ్యక్షేత్రాలు దేశం నలు మూలల నుంచీ భక్తులను ఆకర్షిస్తున్నాయి. జాతీయ సమైక్య సాధనకు ఇలాంటి కేంద్రాలు ఎంతగానో తోడ్పడుతున్నాయి.

ఇటీవలి కాలంలో భాషా దురభిమానాలూ, ప్రాంతీయ దురభిమానాలూ జాతీయ సమైక్య భావనకు భంగం కలిగిస్తున్నాయి. ఆర్థిక, పారిశ్రామిక అసమానతలు కూడా దీనికి దోహదం చేస్తున్నాయి. కేంద్ర ప్రభుత్వం తాలూకు ప్లానింగ్ కమిషన్ అన్ని ప్రాంతాల వారికీ సమానంగా న్యాయం చేకూర్చాలి. విద్యార్థులలో జాతీయ భావన, సమైక్య భావన పెంపొందించడంలో ఉపాధ్యాయుని పాత్ర ప్రధాన మైంది. ●

# చిమ్మట పురుగు శృంగారం



కన్నెచెర వీడని ఆడపురుగు ముందుగా ఒకచోట ఒక బొట్టు ద్రవం విడుస్తుంది. దాని ఘాటైన వాసన గాలిలో నలుదిశలకూ వ్యాపిస్తుంది. మైలు దూరాన ఉన్న మగ చిమ్మట ఈకలాంటి తన మీసాలతో ఆ వాసనను గుర్తించి, ఆ వాసన వస్తున్న దిశగా బయలుదేరి ఆడ చిమ్మటను సమీపిస్తుంది. అక్కడ మగ చిమ్మట ముందుగా కామోద్రేకాన్ని కలిగించే ఒక ద్రవాన్ని విడవాలి. అప్పుడు గాని ఆడచిమ్మట సంగమానికి సమ్మతించదు.

"ఎదురు దెబ్బలు తిన్న మనిషి వివేకం సంపాదించుకుంటాడు." —ఫ్రాంక్లిన్

# యోగాసనాలు

వ్యాయామవిద్యా ప్రవీణ శ్రీ జి. శ్రీనివాసరావు

### 8. మత్స్యాసనం:

వెల్లకిలా పడుకొని ముందుగా పద్మాసనం వెయ్యాలి. చేతులతో కాలి బొటనవేళ్ళను పట్టుకుని చిత్రంలో చూపిన విధంగా తల వెనుకకు వంచాలి. సర్వాంగాసనం వేసిన వెంటనే వెయ్యవలసిన ఆసనం ఇది.



*MATSYASANA*

వ్యవధి: 10 మొదలు 15 సెకనులు.

ప్రయోజనాలు: ఉబ్బసం వ్యాధి నివారణకు ఈ ఆసనం పెట్టింది పేరు. దీనివల్ల రక్తానికి ప్రాణవాయువు సరఫరా ఎక్కువ అవుతుంది. ఎండోక్రిన్ గ్రంథుల స్రావం పెరుగుతుంది. యువకులకు ఈ ఆసనం చాలా మంచిది.

### 9. ధను రాసనం:

గడ్డం నేలకు ఆనేట్టు బోర్ల పడుకోవాలి. చేతులు తొడల పక్కన ఉండాలి. చిత్రంలో చూపినట్లు తల పైకెత్తి కాళ్ళు ముడిచి చేతులతో సీలమండలను అందుకొని, ధనుస్సు ఎక్కుపెట్టినట్టు వాటిని ముందుకు లాగుతూ ఉండాలి. వెన్నుపాము ధనురాకారంగా వంగుతుంది. రొమ్ము, కడుపు, తొడలు మాత్రం నేలను తాకుతూ ఉండాలి.

## కొత్త అలవాట్లతో కొత్త జబ్బులు!

అలవాట్లు మారుతున్న కొద్దీ పాశ్చాత్య దేశాలలో కొత్త కొత్త జబ్బులతో రోగులు డాక్టర్ల దగ్గిరికి వస్తున్నారు. అలాంటి ఒక జబ్బు 'టెలివిజన్ త్రాంబోసిస్'. టెలివిజన్ సెట్టు ముందు చాలాసేపు కూర్చోడం వల్ల కాళ్ళలోని రక్తనాళాలలో వచ్చే జబ్బు ఇది. మరోటి 'జీన్స్ డెర్మటోసిస్'. ఒంటికి అంటిపెట్టుకుని ఉండే 'జీన్స్' డ్రస్సు ధరించడం వల్ల యువతీ యువకులకు కొత్తగా వస్తున్న చర్మవ్యాధి ఇది. ఇంకోటి 'పంక్ సిండ్రోమ్' చాలాసేపు ఒళ్ళు వణికిస్తూ చేసే 'పంక్' డాన్స్‌వల్ల కళ్ళు ఎర్రబడే నేత్రవ్యాధి.

"సభల వల్లా, ఆర్భాటాల వల్లా కాదు;
భావ వికాసం వల్లనే సంఘ సంస్కరణ సాధ్యం!" — హెన్రీ జార్జ్




DHANURASANA

వ్యవధి: 10 మొదలు 20 సెకనులు.

ప్రయోజనాలు: భుజంగ, శలభాసనాల కలయిక ఈ ఆసనం. ఈ మూటినీ కలిపి 'ఆసనత్రయం' అంటారు. ఒంట్లో కొవ్వును తగ్గించి, ఎలాంటి బద్ధకాన్నైనా ఈ ఆసనం తొలగిస్తుంది. స్త్రీలకు ఇది మరింత అనుకూలమైన ఆసనం. దీనివల్ల రొమ్ము సాగి ఊపిరితిత్తులు వీలైనంత ఎక్కువగా వ్యాకోచం చెందే అవకాశం కలుగుతుంది. డయాఫ్రమ్ కదలిక కడుపులోని అవయవాలను మాలీసు చేస్తుంది. రోజూ ఉదయం ఠంచన్‌గా వేళకు విరేచనం అవుతుంది. అజీర్తినీ, కీళ్ళ నొప్పులనూ, ప్రేవులలో వచ్చే గాస్ట్రిక్ వ్యాధులనూ ఈ ఆసనం నివారిస్తుంది. (సశేషం)

## మిక్కిలి పెద్ద జంతు ప్రదర్శన శాల

ప్రపంచంలో మొత్తం సుమారు 600 జంతు ప్రదర్శనశాల లున్నాయి. ఏటా 33 కోట్ల మంది వాటిని సందర్శిస్తున్నారు. వాటిలో నమీబియా (నైరృతి ఆఫ్రికా)లోని 'ఎటోషా' జంతు స్థావరం ప్రపంచం అంతటిలో మిక్కిలి పెద్దది. 1907వ సం.రం నుండి క్రమంగా దాని విస్తీర్ణం పెరుగుతూ వచ్చింది. ఇప్పుడు దాని విస్తీర్ణం: 38,427 చ. మైళ్ళు.

## రష్యాలో బాలల సంక్షేమం



రష్యాలో పిల్లలకు వైద్య సదుపాయం ఉచితం. 15 ఏళ్ళ లోపు పిల్లలకు వినోదాలూ, ఆటలూ ప్రభుత్వమే ఏర్పాటు చేస్తుంది. చదువుకి వాళ్ళ కుటుంబం కానీ చెల్లించనక్కర లేదు. సంగీతం, చిత్రకళ, క్రీడలు మొదలైన వాటిలో ప్రభుత్వం నడిపే పాఠశాలలలో పిల్లలు ఉచితంగా తమ నైపుణ్యాలను వృద్ధి చేసుకోవచ్చు పెద్దల కిచ్చే ధరలో మూడోవంతు ధరలకే పిల్లలకు పుస్తకాలు లభిస్తాయి. రష్యాలో తయారయ్యే ప్రతి నాలుగు చలన చిత్రాలలోనూ ఒకటి బాలల చిత్రం. పిల్లల దుస్తులనూ, ఆట వస్తువులనూ ప్రభుత్వం సబ్సిడీ ధరలకు వారికి అందజేస్తుంది.

"విజాయితీ, సమర్థత, స్వార్థ త్యాగం కొరవడితే వ్యవస్థలు కూలిపోతాయి." —మహాత్మా గాంధీ

# కార్యానుల గియటం ఎలా?

టి. వెంకటరావు

## 18
## చలనం



బాలెన్స్ మనిషి నడుస్తున్నప్పుడు గాని, పరుగెత్తుతున్నప్పుడు గాని శ్రద్ధగా గమనించండి. అతని ఎడమ కాలూ, కుడి చెయ్యీ ముందుకు సాగుతూ ఉంటే కుడికాలూ, ఎడమ చెయ్యీ వెనుక పడి ఉంటాయి. అలా ఎందుకు జరుగుతూంది? శరీరం చలనంలో ఉన్నప్పుడు బాలెన్స్ నిలిపి ఉంచడానికి అది అవసరం. శరీరం భూమ్యాకర్షణశక్తిని నిరోధించడానికి అది తోడ్పడుతుంది. రెండు కాళ్ళూ గాని, రెండు చేతులూ గాని ఒకే దిశలో కదిలితే శరీరం బ్యాలెన్స్ తప్పుతుంది.

శరీరం తాలూకు వివిధ భంగిమలలో భూమ్యాకర్షణ శక్తిని తట్టుకునేందుకు శరీరం

### వజ్రాల వ్యాపారంలో ఇండియన్ల ముందంజ

ముడి వజ్రాలూ, సానబట్టిన వజ్రాలూ అమ్మకంలో ప్రపంచంలో మిక్కిలి ప్రధాన వాణిజ్య కేంద్రం అయిన ఆంట్వెర్ప్ (బెల్జియమ్) లో ఇండియాలోని బొంబాయి, సూరత్‌ల నుంచి వెళ్ళిన వర్తకులదే పై చేయి. ఆ నగరంలో ఏటా జరిగే 450 కోట్ల డాలర్ల వజ్రాల వ్యాపారంలో దాదాపు 3వ వంతు 1960 లలో అక్కడికి వలస వెళ్ళిన ఇండియన్ వర్తకుల చేతులలోనే ఉంది.

"మేలైన చావును వరించే ధైర్యం కాదు;
హుందాగా జీవించే ధైర్యం కోరుకోవాలి." - థామస్ కార్లైల్



అవలంబించే మరో విధానాన్ని కూడా పై చిత్రాలలో మీరు గుర్తించవచ్చు. భుజ రేఖ, నడుం రేఖ భిన్న దిశలలో కదులుతూ ఉంటాయి. ఈ కదలికవల్ల ఒక కొసలో అవి చేరువ అవుతూ, మరొక కొసలో దూరం అవుతూ ఉంటాయి. పై చిత్రాలు చూడండి. ప్రాచీన కాలంలోనే మన శిల్పులు స్త్రీ పురుషుల, పిల్లల శిల్పాలను చెక్కే- సందర్భంలో ఈ సత్యాన్ని గుర్తించినట్లు కనిపిస్తుంది. ఈ నియమాలను పాటించడం ద్వారా విగ్రహాలలో బాలెన్స్‌నే కాక, ఒక విధమైన లయానుగుణమైన (rhythmic) చలనాన్ని కూడా ఆ శిల్పులు సాధించారు.

(సశేషం)

## ఉన్మాదుల సంఖ్యలో కూడా కేరళదే ముందంజ

ఇండియాలో అక్షరాస్యుల శాతం అత్యధికంగా ఉండడంలోనే కాక చిత్త వైకల్యాల విషయంలో కూడా కేరళదే అగ్రస్థానం. 1981 లో అక్కడ చిత్త వైకల్యాల చికిత్సకు మెంటల్ ఆసుపత్రులలో చేర్చబడిన వారి సంఖ్య సుమారు 8,970. ప్రతి 10,000 మందికి ముగ్గురు ఆ రాష్ట్రంలో చిత్తవైకల్యంతో బాధపడుతున్నారు.

## రెడ్ టేప్ (జాప్యం) వల్ల రూ. 1,50,000 కోట్లు నష్టం

గత 30 సంవత్సరాలలోనూ ప్రభుత్వ కార్యాలయాలలోని జాప్యం వల్ల మన దేశానికి రూ. 1,50,000 కోట్లు నష్టం వచ్చింది. ఒక గవర్నమెంటు ఆఫీసరు బల్ల మీద రూ. 100 కోట్ల పెట్టుబడితో నడిచే సంస్థ తాలూకు ఒక కాగితం కదలడం ఒక్కరోజు ఆలస్యమయితే అది ఆ కంపెనీకి రూ. 2.5 లక్షల నష్టం కలగడానికీ, జాతీయోత్పత్తి రూ. 27 లక్షలు తగ్గడానికీ కారణం అవుతుంది.

"మనం ఎంత నిజాయితీ పరులం అయితే,
మన ప్రభుత్వ పాలన అంత బాగా సాగుతుంది." —జెఫర్సన్

## ఎందుకు?

# ఎండలో కొవ్వొత్తి దీపం ఎందుకు కనిపించదు?

వెలుతురులో కలిగే మార్పులకు సరిపుచ్చుకునేందుకు మనిషి కంటిలో రెండు విధాలైన చర్యలు జరుగుతాయి. ఒకటి: కాంతి



తగ్గిన కొద్దీ కంటిలోని నల్ల గుడ్డు ద్వారం బాగా తెరుచుకుంటూ ఉండడం. రెండోది: రాసాయనికమైన మార్పు. వెలుతురు ఎక్కువగా ఉండే ఎండలో నల్ల గుడ్డు ద్వారం బాగా ముడుచు కుంటుంది. దానికి తోడు రాసాయనిక మైన మార్పులు కూడా జరుగుతాయి. కన్ను ఎక్కువ వెలుతురును స్వీకరించేందుకు సిద్ధం అవుతుంది. అందుచేతనే చాలా దుర్బల మైన కొవ్వొత్తి వెలుతురును అది గుర్తించలేకపోతుంది. ●

## ఎలా?

# భాషలు ఎలా పుట్టాయి?



ప్రపంచంలోని అన్ని భాషలూ ఒకే మూల భాష నుంచి వచ్చాయని కొందరు భాషా శాస్త్ర వేత్తలు అంటున్నారు. ప్రపంచంలో వేర్వేరు ప్రాంతాలలో వేర్వేరు మూల భాషలు ఏర్పడి వాటి నుంచి వచ్చిన భాషలు వేర్వేరు భాషా కుటుంబాలుగా రూపొందాయని మరి కొందరు అంటున్నారు. ఒకే మూల భాష నుంచి ఎన్నో కొత్త భాషలు పుట్టడానికి అనేక కారణా లున్నాయి. ఒక కారణం - భాష మారే స్వభావం కలది కావడం. ఒకే భాష మాట్లాడే వారు ఏ కారణాలవల్లో విడిపోతే క్రమంగా వారి ఉచ్చారణలో, పద జాలంలో మార్పులు వచ్చి అవి రెండూ భిన్న భాషలుగా ఏర్పడ వచ్చు. పరిసరాల భాషల ప్రభావం వల్ల ఒక మాండలిక భాష క్రమంగా కొంత కాలానికి ప్రత్యేక భాషగా రూపొందవచ్చును. ●

"పశుత్వం + మానవత్వం + దైవత్వం = మానవుడు."—స్వామి వివేకానంద

# కలం స్నేహితులు

(మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈ శీర్షిక క్రింద ప్రచురించ బడాలంటే తగిన వివరాలతో సహా రూ. 3 లు మనియార్డరు ద్వారా పంపండి.) —సంపాదకుడు.

1. ఎమ్. కన్నబాబు, 18 సం.లు, C/o ఎమ్. రామమూర్తి, ప్రేమనగర్, 4 వ లైన్, బరంపురం-760 002.

కలం స్నేహం, విజ్ఞానదాయకమైన పుస్తకాలు చదవడం, శాస్త్రీయ సంగీతం వినడం.

2. డి. పాపయ్య, C/o యు. మొశిల, పొగాకు వర్తకులు, న్యూ గంజ్, కరీం నగర్-505 001.

కలం స్నేహం, సంగీతం వినడం, పుస్తక పఠనం.

3. తానికొండ శ్రీనివాసరావు, 16 సం.లు, S/o ఆదినారాయణరావు, గోపాల నగరం, ఒంగోలు-523 001.

పత్రికలు చదవడం, కథలూ, కవితలూ, వ్యాసాలూ వ్రాయడం, స్టాంపుల సేకరణ.

4. నాళం అమరనాథ్, రాజ్యలక్ష్మి హాస్పిటల్ ఎదురుగా, కొత్తపేట, తెనాలి-522 201.

రేడియో వినడం, పుస్తక పఠనం, కలం స్నేహం.

5. బి. రమేష్‌బాబు, ఎం.బి.బి.ఎస్ (ఫైనల్ సంవత్సరం విద్యార్థి), రూం నెం.

## అమెరికా టర్కీ కోడి



అడవి టర్కీ కోళ్ళు అమెరికాలో ఎక్కువగా కనిపిస్తాయి. ఆహారం కోసం వీటిని మొట్టమొదట పెంచినవారు మెక్సికోలోని 'అజ్‌టిక్ ఇండియన్‌లు'. ఇక్కడి నుంచే ఇవి 16 వ శతాబ్దంలో స్పెయిన్ మొదలైన యూరప్ దేశాలకు వెళ్ళాయి. తిరిగి 'పిల్‌గ్రిమ్ ఫాదర్స్' వాటిని ఉత్తర అమెరికాకు తెచ్చారు. ఒక్కొక్క టర్కీ కోడి దాదాపు 23 కి.గ్రా. ల బరువు ఉంటుంది. అమెరికాలో తరుచు పండుగ రోజులలో దీని మాంసం తింటారు.

---

"నా దేశంలో ఆకలితో అలమటించే ఒక్క కుక్క ఉన్నా, దాని కడుపు మంట చల్లార్చడమే నా మతం." —స్వామి వివేకానంద

481, వైశ్య హాస్టల్, కాచిగూడ చౌరస్తా, హైదరాబాద్-500 027.

గ్రాఫాలజీ, కలం స్నేహం, సినిమాలు చూడడం.

6. ఎమ్. అంజన్ గౌడ్ బి. ఏ., 28 సం.లు, S/o చిన్నయ్య గౌడ్, అంతారం, చేవెళ్ళ తాలూకా, రంగారెడ్డి జిల్లా-501 503.

రేడియో వినడం, నాణేల సేకరణ, స్టాంపుల సేకరణ.

7. యు. శివన్న, 21 సం.లు, S/o యు. ఈరన్న, ప్లాట్ నెం. 5/147/7, సోమప్ప నగర్, ఎమ్మిగనూరు, కర్నూలు జిల్లా-518 360.

కలం స్నేహం, చిత్రలేఖనం, షెడ్లు వ్రాయడం.

8. బి. యస్. కుమార్, 19 సం.లు, మెడిసిన్ విద్యార్థి, C/o పి. లక్ష్మయ్య చౌదరి (రిటైర్డ్ తాసిల్దారు) ఏలూరు రోడ్డు, గుడివాడ-521 301.

కలం స్నేహం, క్రికెట్ కామెంటరీ వినడం, విచిత్ర వస్తు సేకరణ.

9. జెల్ది మోహన్, 17 సం.లు. ఇంటర్ మొదటి సంవత్సరం విద్యార్థి, C/o జి. రామదాసు, చేర్యాల, వరంగల్ జిల్లా-506 223.

పుస్తక పఠనం, క్విజ్, రేడియో వినడం.

10. పి. రాధిక, 20 సం.లు, C/o కెప్టెన్ పి. వి. రాజు, ఎస్. ఎమ్. క్యూ. నెం. 2/5, ఓల్డ్ పాలీ రోడ్డు, జోద్‌పూరు, (రాజస్థాన్) 342 001.

చిత్రలేఖనం, కలం స్నేహం.

## ఏప్ కోతి, మనిషి తో బుట్టువులు!



నార్త్ కెరోలినా (అమెరికా)లో దర్హామ్ లోని డ్యూక్ యూనివర్సిటీకి చెందిన వైద్య శాస్త్ర పరిశోధకులు మనిషి, ఆఫ్రికాలోని 'ఏప్' కోతులూ ఒకే పూర్వికుని నుంచి వచ్చిన వారనడానికి అదనపు 'జీవ రాసాయనిక' సాక్ష్యం సేకరించారు. ఆ పరిశోధక బృందానికి నాయకత్వం వహించిన డా. బార్టన్ ఎఫ్. హెయిన్స్ ప్రయోగశాల జంతువులలో తయారైన 11 ఆంటీ బాడీలు మనుష్యుల లోనూ, ఏప్ కోతులలోనూ గల 'టీ-కణాల' (థైమస్ గ్రంథిలో తయారై వ్యాధులను ఎదుర్కొనే తెల్ల రక్త కణాలు) మీద ఎలాంటి ప్రభావం ప్రదర్శించేదీ పరీక్షించగా ఇద్దరిలోనూ ఒకే రకం ప్రతిక్రియలు కనిపించాయట.

"ఒక టన్ను శాస్త్రజ్ఞానం కన్న,
ఒక ఔన్సు అనుభవ జ్ఞానం గొప్పది" —స్వామి వివేకానంద

# జీవితంలో కలుపుగోలుతనం

ప్రొ॥ కే. ఆర్. బాలన్, మద్రాసు.

[శ్రీ కే. ఆర్. బాలన్ 'ప్రజా సంబంధాలు', 'మార్కెటింగ్', 'సేల్స్ మేనేజ్‌మెంట్', 'కమ్యూనికేషన్స్' లలో ప్రొఫెసరు. తన 20వ ఏటనే 'దీనబంధు' అని ప్రేమగా పిలువబడే డా. ఛార్లెస్ ఎఫ్. ఆండ్రూస్ వద్ద ఆంతరంగిక కార్యదర్శిగా చేరారు. అనంతరం 'కౌంటర్ ప్రోపగాండా' డైరెక్టరేట్‌లో 'ఇన్ఫర్మేషన్ కో-ఆర్డినేటర్' గానూ, యుద్ధ వార్తల ప్రసారకుడుగానూ పని చేశారు. రెండు దశాబ్దాల పాటు ఒక పెద్ద బ్రిటిష్ సంస్థలో 'ప్రజా సంబంధాల' ఆఫీసరుగా ఉన్నారు.]

ఇండియా చరిత్రలో రాజులూ, మంత్రులూ ఎలా ప్రజలతో కలిసి మెలిసి ఉండేవారో తెలిపే యథార్థ గాథలు ఎన్నో మనకు కనిపిస్తాయి. 'పోర్కై-పాండ్యన్' అనే ఒక పాండ్య రాజు రోజూ రాత్రి పూట మారు వేషంతో నగరంలో సంచరిస్తూ పౌరుల మంచి చెడ్డలు తెలుసుకుంటూ, వారికి తగిన రక్షణ కలిపిస్తూ ఉండేవా దని ప్రసిద్ధి।

ఇటీవలి కాలంలో మైసూరు సంస్థానానికి సర్ మీర్జా ఇస్మాయిల్ దివాన్‌గా ఉన్న రోజులలో సుప్రసిద్ధ కాంగ్రెసు నాయకుడు శ్రీ కే. టి. భాష్యం అయ్యంగారు మైసూరు అసెంబ్లీలో ప్రతి పక్షంలో ఉండేవారు. ఒక సందర్భంలో బ్రిటిష్ వారి పట్ల పక్షపాతంతో కూడిన మైసూరు ప్రభుత్వ పరిపాలన విధానాలను తీవ్రంగా గర్హిస్తూ అసెంబ్లీలో ఆయన ప్రసంగిస్తున్నారట. మైసూరు ప్రభుత్వం బ్రిటిష్ ప్రభుత్వం మీద పూర్తిగా ఆధారపడి ఉన్నందువల్ల సభ్యులలో చాలా మంది రాజద్రోహ నేరం క్రింద భాష్యం

---

## ఫిజిక్స్‌లో తొలి నోబెల్ ప్రైజ్ గ్రహీత



ఫిజిక్స్‌లో నోబెల్ బహుమతి అందుకున్న మొట్టమొదటి శాస్త్రవేత్త జర్మనీలోని విల్హెల్మ్ సి. రోయెంట్‌జెన్. 1901 లో ఆయన కనుగొన్న రోయెంట్ జెన్ కిరణాలకు గాను ఆ బహుమతిని ఆయనకు ఇచ్చారు.

---

"కాల క్రమేణ రీతులూ, నీతులూ మారవచ్చు;
అలవాట్లు మాత్రం మారవు." —బెర్నార్డ్ షా

అయ్యంగారిని అరెస్టు చేస్తారని భావించారు. కాని అందుకు పూర్తిగా విరుద్ధంగా జరిగింది. అసెంబ్లీ సభా నాయకుడైన మీర్జా చిరునవ్వుతో అయ్యం గారి ప్రసంగం వింటూ మధ్య మధ్య హర్షధ్వానాలు కూడా చేశారు. ఆ సాయంత్రం తన అంతరంగిక కార్యదర్శిని పిలిచి బజారులో మేలి రకం మామిడి పళ్ళు ఒక బుట్టెడు కొని, దానికి "మీ అభిమానీ, మిత్రుడూ అయిన మీర్జా నుంచి" అనే ఒక చీటీ అంటించి అయ్యంగార్ ఇంటికి పంప మని చెప్పాడు! ఆ నాడు మొదలు వా రిరువురూ - మధ్యలో వారి మధ్య ఎన్ని రాజకీయ అభిప్రాయ భేదాలు వచ్చినా - జీవితాంతం మంచి మిత్రులుగానే గడిపారు. ప్రజలతో కలుపుగోలు తనం సాధించడానికి ఇది ఒక సరళమైన చక్కని ఉపాయం. సర్ మీర్జా ఇస్మాయిల్ అనుకోకుండానే ఈ 'కలుపుగోలు తనం' సాధనాన్ని ప్రయోగించి తన రాజకీయ శత్రువును మిత్రుడుగా చేసుకున్నాడు.

ఒక వ్యక్తి ప్రజలతో ఎలా సత్సంబంధాలు ఏర్పరచుకున్నాడో తెలిపే నిజంగా జరిగిన కథ ఒకటి చెబుతాను. మహారాష్ట్ర ప్రభువు పీష్వా మాధవరావు మంత్రి అయిన రామశాస్త్రి మీద ప్రజలకూ, ఉద్యోగులకూ, ప్రభువుకూ కూడా ఎంతో గౌరవం, అభిమానం ఉండేవి. ఆయన చాలా సమర్థుడు కావడమే కాక, గొప్ప నిజాయితీ పరుడు; మిక్కిలి నిరాడంబరుడు. ప్రభువు ఒకసారి ఆయన నిరాడంబర జీవనాన్ని గురించి ప్రశ్నించగా ఆయన ఇలా అన్నారు: "ప్రభూ! మన రాజ్యంలో ఏమి జరుగుతూందీ చూడడానికి నాకు రెండే కళ్ళు ఉన్నాయి. కాని అనుక్షణం వేలాది కళ్ళ జంటలు 'ప్రభువుల అభిమాన పాత్రుడైన' ఈ మంత్రిని గమనిస్తూ ఉంటాయి!"

రామశాస్త్రి భార్య కూడా చాలా ఉత్తమురాలు. భర్త అడుగుజాడలలోనే నడిచేది.

---

## మూడో ప్రపంచ యుద్ధం - ఫ్రెంచ్ విద్వాంసుని జోస్యం



16వ శతాబ్దం నాటి జగద్విఖ్యాతుడైన ఒక ఫ్రెంచ్ జ్యోతిష్కుడు మూడో ప్రపంచ యుద్ధం 1999లో ఆరంభం అవుతుం దనీ, 2,016 దాకా 17 ఏళ్ళ పాటు సాగుతుం దనీ జోస్యం చెప్పాడు అమెరికా రాజ్యస్థాపన, రెండో ప్రపంచ యుద్ధం, పెరల్ హార్బర్ మీద దాడీ, హిట్లర్ పాలన లాంటి ఎన్నో విషయాలను గురించి ఆయన చెప్పిన జోస్యం నిజం అయింది. తాను ఏ స్థలంలో ఏ రోజున ఎన్ని గంటలకు మరణించేదీ కూడా ఆయన కచ్చితంగా చెప్పారట! ఆయన జోస్యం ప్రకారం 3,797వ సంవత్సరంలో ఈ భూగోళం మీద జీవజాలం అంతరిస్తుంది.

"నియంతలను ధిక్కరించడం భగవంతుణ్ణి ఆశ్రయించడమే!" —బెంజమిన్ ఫ్రాంక్లిన్

ఒకసారి 'గుడిపర్వం' అనబడే మహారాష్ట్రుల ఉగాది పండుగ వచ్చింది. రాజమాత రామ శాస్త్రి భార్యను ఆ నాడు అంతఃపురానికి రమ్మని ఆహ్వానించింది. భర్త అనుమతితో ఆమె ఆ ఆహ్వానం అంగీకరించింది. అంతః పురంలో రాజమాత ఆమెకు ఘనంగా విందు చేసి జరీ అంచు పట్టుకోక పెట్టి, ఒక విలువైన ముత్యాల హారం బహూకరించింది. "ఇంత విలువైన వస్తువులు మా కెందు కమ్మా!" అని ఆమె తప్పించుకో జూచినా, రాజమాత బలవంతం మీద ఆమె వాటిని అంగీకరించక తప్పలేదు.

రాజపరివారంతో సహా పల్లకీ మీద వైభవంగా ఆమెను రాజమాత తిరిగి ఇంటికి పంపింది. రాజ పరివారం వచ్చి తలుపు తట్టగా బయటికి వచ్చిన రామశాస్త్రి కొత్త పెళ్ళికూతురు లాగ మెరిసిపోతున్న తన భార్యను చూసి "అయ్యో! రామశాస్త్రి గారి ఇల్లు ఇది కాదండీ! మీరు పొరపాటు అడ్రస్సుకి వచ్చారు" అన్నాడు. క్షణంలో ఆయన భార్య తన భర్త ఆడుతున్న నాటకం గ్రహించింది. రాజపరివారంతో తిరిగి తనను అంతఃపురానికి తీసుకు వెళ్ళ మని చెప్పింది. రాజమాత ఇచ్చిన కానుక లన్నీ ఆమెకు తిరిగి ఇచ్చి వేసి నిరాడంబరంగా, మామూలుగా ఆమె ఇంటికి తిరిగి వచ్చింది. అప్పుడు రామ శాస్త్రి ఎంతో ప్రేమతో ఆమెను పలుకరించాడు. "చూశావా - నువు అంతఃపురంలో ఉండగా ఇందాక ఎవరో రాజకుమారి పల్లకీ ఎక్కి మన ఇంటికి వచ్చింది. పరాయి స్త్రీలు నాకు తోబుట్టువుల్లాంటివా రని నీకు తెలుసు గదా! ఏదో చెప్పి పంపి వేశాను" అన్నాడు.

భార్యకు విషయం అర్థమైనా, పైకి ఏమీ తేలకుండా - "ఇక మీద కోటకు రమ్మని ఆహ్వానం వస్తే మనం ఇద్దరం కలిసే వెళదామండీ!" అంది. ●

## మిక్కిలి పెద్ద వెండి బిందెలు



ప్రపంచంలో మిక్కిలి పెద్ద వెండి బిందెలు రెండు జయపూర్ (రాజస్థాన్) మహారాజా దివాణంలో ఉన్నాయి. 1902 లో 7 వ ఎడ్వర్డ్ పట్టాభిషేకానికి లండన్ వెళుతూ అక్కడ ఉండగా తాను త్రాగడం కోసం హరిద్వార్ లోని గంగాజలం తీసుకువెళ్ళడానికి మహారాజా ఆ బిందెలు చేయించారు. ఒక్కొక్కటీ 309 కి గ్రా.ల బరువున్న ఆ బిందెల ఎత్తు 160 సెం.మీ.లు.చుట్టుకొలత 248 సెం.మీ.లు. ఖరీదు రూ. 60,063 లు. గోవిందనారాయణ్ అనే నిపుణుడైన ఆస్థాన కంసాలి ఆ బిందెలు తయారు చేశాడు.

"పరిస్థితులు మన అధీనంలో లేకపోయినా
మన ప్రవర్తన మన చేతిలోనే ఉంది." - బెంజమిన్ డిస్రేలీ

# ప్రపంచ వార్తలు

## 'త్రాగుడు' జబ్బు నయం చేసేందుకు కొత్త మందు:

'మెర్క్' కంపెనీ 'త్రాగుడు' అలవాటు మానలేని రోగులకు ఉపయోగించే ఒక క్రొత్త టాబ్లెట్‌ని కనిపెట్టింది. ఈ మందును కొందరు రోగులమీద ప్రయోగించి చూడడం కూడా పూర్తి అయింది. దీనివల్ల ఇతర దుష్ఫలితా లేవీ ఉండవని రుజువైంది.

* * *

## బుధ గ్రహం మీద రష్యా మనుష్యులను దింపుతుందా?

అమెరికన్ అంతరిక్ష సాంకేతిక నిపుణుడు డా. ఛార్లెస్ షెల్డన్ అభిప్రాయం ప్రకారం ఎర్రని బుధగ్రహం మీద మనుష్యులను దింపడానికి రష్యా అప్పుడే సన్నాహాలు ప్రారంభించింది. అందుకు నాందిగా మనుష్యులు ఉండే పెద్ద అంతరిక్ష కేంద్రాన్ని ఒకదాన్ని భూమి కక్ష్యలో నిర్మిస్తారు. 1992 లో బోల్షివిక్ విప్లవపు 75 వ వార్షికోత్సవ సందర్భంగా రష్యా బుధగ్రహం మీద దిగడం జరుగవచ్చునని వాషింగ్టన్‌లోని నిపుణులు అంటున్నారు.

## 3,800 ఏళ్లనాటి స్త్రీల శవాలు:

చక్కగా భద్రపరచబడిన సుమారు 3,800 ఏళ్ళనాటి స్త్రీల శవాలు రెండు ప్రస్తుతం చైనాలోని షాంఘై నగరంలో ప్రదర్శిస్తున్నారు. క్సింజియాంగ్ రాష్ట్ర వాయవ్య భాగంలో 'లోప్‌నోర్' సమీపాన ఆ శవాలు బయటపడ్డాయి.

*

## అమెరికా అధ్యక్షుని కుమారునకు నిరుద్యోగి భృతి



ప్రపంచంలో మిక్కిలి పెద్ద పెట్టుబడిదారీ రాజ్యం అయిన అమెరికాలో ప్రస్తుతం నిరుద్యోగుల సంఖ్య 1.13 కోట్లు. అమెరికన్ అధ్యక్షుడు రీగన్ కుమారుడు కూడా ఆత్మాభిమానంతో తండ్రి పలుకుబడి వల్ల ఉద్యోగం సంపాదించడానికి నిరాకరించి నిరుద్యోగిగా నమోదై, 120 డాలర్లు నిరుద్యోగి భృతి నెల నెలా అందుకుంటున్నాడు.

"కార్య సాఫల్యమునకు మనో నిశ్చయము ప్రథమ స్థానము" —వీరేశలింగం పంతులు

## అంతర్జాతీయ టెలీ కమ్యూనికేషన్ల సంవత్సరం:

అంతర్జాతీయ టెలీ కమ్యూనికేషన్ల యూనియన్ వారు 1983 ను 'అంతర్జాతీయ టెలీ కమ్యూనికేషన్ల సంవత్సరం' గా ప్రకటించారు. ఈ ఏడాది ప్రపంచంలోని ప్రతి 100 మందికి ఒక టెలిఫోన్ ఉండేట్టు చెయ్యడానికి గట్టి కృషి జరుగుతుంది.

* * *

## హొటల్ 'ఆస్వాన్ ఓబెరాయ్'కి ఆస్కార్ అవార్డు:

ప్రపంచంలోని 300 ప్రశస్తమైన హోటళ్ళలో ఒకటి అయిన ఈజిప్ట్‌లోని 'ఆస్వాన్ ఓబెరాయ్' హోటల్ 1981 వ సం. పు అంతర్జాతీయ ఆస్కార్ అవార్డు గెలుచుకుంది. అతిథులుగా దిగిన టూరిస్టులకు అందజేసిన అద్భుతమైన పరిచర్యలకుగాను ఆ హోటల్‌కి ఈ అవార్డు ఇచ్చారు.

## బొగ్గు బూడిదతో కొత్తరకం ఇటికలు:

చైనాలోని మిక్కిలి పెద్ద పారిశ్రామిక కేంద్రం అయిన షాంఘే నగరంలో పరిశ్రమలలో బొగ్గు కాలిపోగా మిగిలే బూడిదతో ఇటికలు, కాంక్రీట్ మొదలైనవి తయారు చేస్తున్నారు. ఇటీవలి వరకూ ఎందుకూ పనికిమాలిన దని ఈ బూడిదను సముద్రం పాలు చేస్తూ వచ్చారు.

## ఫాక్‌లాండ్ దీవుల అభివృద్ధికి బ్రిటన్ పథకాలు:

ఫాక్‌లాండ్ దీవులలో ఉన్ని పరిశ్రమను పెంపొందించడానికి, ఓడరేవుల నిర్మాణానికి, చేపల పరిశ్రమ అభివృద్ధికి, నూనెబావుల అన్వేషణకూ తయారు చేసిన పథకాలను బ్రిటిష్ ప్రభుత్వం పరిశీలిస్తూంది. బ్రిటన్, కెనడా, ఆస్ట్రేలియాల నుంచి ఆ దీవులకు వలస పోవడానికి 600 మంది పద్ద నుంచి దరఖాస్తులు వచ్చాయి. ●

## జనాభా - తిండి ధాన్యాల కొరత



ప్రపంచంలో ఆహార పరిస్థితి నానాటికీ దిగజారుతున్న దనీ, ఆఫ్రికా, ఆసియా, లాటిన్ అమెరికా ఖండాలలో లక్షల మంది పస్తులతోనో, అర్ధాకలితోనో బాధపడుతున్నారనీ ప్రపంచ ఆహార సమితి (world food council) తమ నివేదికలో తెలియజేసింది. ఇప్పటి అంచనాల ప్రకారం 2,000 వ సం. రం నాటికి జనాభా 40 శాతం పెరిగే పక్షంలో ఆహార పరిస్థితి మరింత అధ్వాన్నం కాగలదు.

"ఎక్కువ మంది చేతులెత్తినంత మాత్రాన అది న్యాయం కాజాలదు" -షిల్లర్

(14 వ పేజీ తరువాయి)

హృద్రోగికి విశ్రాంతి ఎక్కువ అవసరం. రోజూ మధ్యాహ్నం పూట ప్రశాంతంగా ఒక గంట సేపు విశ్రమిస్తాను. ధ్యానం హృద్రోగికి సహాయం చేస్తుంది. మనస్సును నిర్మలంగా ఉంచుకోడానికి ప్రతి ఉదయం స్నానం చేసిన వెంటనే ప్రశాంతమైన మనస్సుతో 15 ని. ల పాటు పూజ చేస్తాను.

గుండె జబ్బుకి ఉపయోగించే మందులు:

వెనుక - 1950 ల దాకా రోగ లక్షణాలను తగ్గించే మందులే - మార్ఫిన్, నెత్తురు గడ్డ కట్టకుండా చూసే మందులూ - వాడేవారు. కాని, ఆ తరువాత విపుల పరిశోధనల వల్ల గుండె కండరాలు చచ్చుబడకుండా చూసే మందు లెన్నో కనిపెట్టారు. వాటిలో కొన్ని:

1. పెర్సాంటిన్: 100 మి. గ్రా. లు. రోజుకి రెండు సార్లు.

2. ఇసోప్టిన్ టాబ్లెట్లు - రోజుకి రెండు.

3. సార్బిట్రేట్: జేబులో సిద్ధంగా ఉంచుకుని, గుండెపోటు వస్తే వాడవలసిన టాబ్లెట్లు.

4. టెర్బ్యు టాలిన్: 5 మి. గ్రా. లు. ఊపిరితిత్తులలోని కండరాల బిగువు సడలించ డానికి ఇది ఉపయోగిస్తుంది.

5. బ్రాన్ కార్డియల్: 2 ఔన్సుల నీటిలో ఒక టేబిల్ స్పూన్ మందు వేసుకుని భోజనానికి ముందు సేవించాలి.

6. డయాజెపమ్, లేదా కంపోజ్, లేదా వాలియమ్ - 5: రాత్రి పడుకో బోయే ముందు ఒక మాత్ర వేసుకోవాలి.

మొదటి అటాక్ వచ్చిన తరువాత రెండు నెలలకి, మూడు నెలలకి ఒకసారి ఆసుపత్రికి వెళ్ళి గుండె పరిస్థితిని పరీక్ష చేయించు కుంటూ ఉండడం అవసరం।

పైపై లక్షణాలను బట్టి గుండెజబ్బు అని నిర్ణయించడానికి వీలులేదు. ఇ.సి.జి. మొద లైన టెస్ట్‌ల వల్ల ఫామిలీ డాక్టర్ గుండె జబ్బు అని నిర్ధారణ చేస్తే తప్ప, చెమటలు పొయ్యడం, రొమ్ములో నెప్పి రావడం చూసి వెంటనే గుండెజబ్బు వచ్చిం దని అనుకో కూడదు. ●

## 'విలువ'లకు విలువ ఇవ్వడం నేర్చుకోవాలి!



"వ్యక్తులకు ప్రత్యేకమైన నేర్పులను బోధిస్తే చాలదు. దానివల్ల వారు ఉపయోగ కర మైన యంత్రాలు మాత్రమే కాగలరు. సామరస్యంతో కూడిన సమగ్ర వ్యక్తిత్వం వారిలో ఏర్పడదు. విద్యార్థులు 'విలువల'ను గ్రహించి వాటిపట్ల అధికాసక్తి చూపించేట్టు చెయ్యడం అవసరం।"

—ఐన్‌స్టైన్

"బాధను తప్పించుకోవడమే జీవితంలో గొప్ప కళ।" —థామస్ జెఫర్సన్

# పోటీ

మే 1983

'విస్డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొన వచ్చు. ఏ ఎంట్రీ కా ఎంట్రీ విడిగా పావు తావు సైజుకి తగ్గని కాగితం మీద వ్రాయాలి. ప్రతి ఎంట్రీమీద అడ్రసు ఉండాలి. ఒకే కాగితం మీద ఒకటి కంటె ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించబడవు. సరియైన, లేదా మేలైన ఎంట్రీలలో లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రు. 10 లు, రు. 7 లు, రు. 5 లు ఖరీదు చేసే పుస్తకాలు బహుమతులుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీలకు 'పోటీ కూపను' (ఒక ఎంట్రీకి చాలు) అంటించి పంపాలి. ఒక కూపనుతో ఒకేసారి ఎన్ని ఎంట్రీ లయినా పంపవచ్చును. ఎంట్రీలు అందవలసిన ఆఖరు తేదీ: మే 20, 1983. పంపవలసిన చిరునామా: పోటీల నిర్వాహకుడు. తెలుగు "విస్డమ్", 9 దేశికా రోడ్డు, మైలాపూరు. మద్రాసు 600 004.

—సంపాదకుడు.

# వ్యాసం

"మరపు రాని మా మేష్టారు" అనే

## అంతర్దృష్టే నాగరకతకు పునాది



"తన పరిసరాలతో అంటీ ముట్టనట్టుగా ఉండే స్వభావం సత్యాన్వేషణకు అవసరం. అంతు లేని ఓర్పు, క్షుద్ర భోగాల పట్ల వైముఖ్యం, అల్పత్వ స్పర్శ లేని వినయం, అచంచలమైన ఆశాభావం, చెక్కు చెదరని నిర్భయత్వం - ఇవి సత్యాన్వేషకునిలో కనిపించే ప్రధాన లక్షణాలు. నిస్స్వార్థపరులైన సత్యాన్వేషకుల వరప్రసాదమైన పర్యవేక్షణవల్ల తప్ప సంఘం సుస్థిరతనూ, అభివృద్ధినీ సాధించలేదు. ఎన్ని చెప్పినా అంతర్దృష్టే నాగరకతకు పునాది."

—డా. రాధాకృష్ణన్

"తెలివైన వాళ్ళు వెళ్ళడానికి సందేహించే చోట్లకు మూరులు పరుగులు పెడతారు."

—పోప్

విషయం మీద 300 మాటలు మించకుండా వ్యాసం వ్రాసి పంపండి.

## క్విజ్

1. బంగారం, వజ్రాలు ఎక్కువగా లభించే దేశం ఏది? 2. జర్మనీలో ఏ నాణెం వాడుతారు? 3. భారత రాజ్యాంగం ప్రకారం లోక్‌సభ, రాజ్యసభల సంయుక్త సమావేశంలో ఎవరిని ఎన్నుకుంటారు? 4. 'కవర్ పాయింట్' అనే మాట ఏ ఆటలో వినిపిస్తుంది. 5. ఆంధ్రప్రదేశ్‌లో ప్రధానమైన ఓడరేవు ఏది? 6. మొహిందర్ అమర్‌నాథ్ ఏ ఆటలో మేటి? 7. 'కేప్ కామెరన్'కి ఇండియన్ పేరేమిటి? 8. తన జీవిత కథ తనే వ్రాసుకుంటే దానిని ఏమంటారు? 9. 'బుడుగు' పాత్రను సృష్టించింది ఎవరు? 10. ఏ క్రీడలో పాండవులు తమ రాజ్యం ఓడిపోయారు?

## పజిల్

ఆధారాలు: అడ్డం. 1. బెజవాడకి ఇప్పటి పేరు, 4. ఇంద్రుడి భార్య, 6. చిన్న మారణాయుధం, 8. ప్రక్క, సమీపం, 11. చాలా కాలము, 13. వకరు + కి, 15. తోక తెగిన ఆకసము, 16. పిండి విసిరే పరికరం, 17. కురియు — కురువంగ, మెరయు —?, 19. మూడవ పురుషార్థము, 20. ముఖము యొక్క తడి, 21. 'వేలుపు' సంబోధనలో, 23. గజి బిజి అయిన 'గాయము', 24. తళతళ, 26. ఉప్పును ఇలా కూడా అంటారు. 27. వేసవి కాలంలో పడే వాన.



నిలువు: 1. విలాసం గల స్త్రీ, 2. సీరు, 3. వెనుక బంట్రోతులు మెడలో తగిలించు

## సౌఖ్యానికి అడ్డ దారి లేదు!



సౌఖ్యానికి తేలికగా ఎవరూ మనకు టిక్కెట్టు ఇవ్వలేరు. కష్టపడి చెమటోడ్చి చేరుకోవలసిన గమ్యం అది. శ్రమపడకుండా ఎవ్వరూ ఎన్నడూ సౌఖ్యాన్ని కైవసం చేసుకోలేరు. 'కష్టే ఫలీ'.

“సత్యాన్వేషణ కోసం చేసే శ్రమ ఎన్నడూ వృథా కాదు” —జోహాన్ డే

కొనేది, 5. మనస్సు, 7. Tasteful గా — తెలుగు చెయ్యండి:, 9. అనేక రకాలు, 10. సప్త స్వరాలలో సప్తమం మినహా, 12. రసముతో కూడినది, 14. ఎదురు తిరిగిన ములికి, 15. ఆ + మెమో, 18. 24 నిము షములలోన, 21. వేయి + మారులు, 22. యోద్ధవు + ఏ, 25. ఆయాసము, ఉబ్బ సము.

## తెలివికి పరీక్ష

1. 'బంగారు పళ్ళానికైనా గోడ చేర్పు ఉండాలి' — ఈ సామెత ఏ సందర్భంలో వాడుతారు? 2. "నిద్రలో నీళ్ళలో మునిగి పోయి ఉక్కిరి బిక్కిరి అవుతున్నట్టు కలగని తత్ఫలితంగా గుండె ఆగి చనిపోయింది" అని ఎవరైనా చెబితే డిటెక్టివ్ నమ్ముతాడా? ఎందువల్ల? 3. చీకటి గుయ్యారంగా ఉన్న గదిలోకి వెళ్ళి మీ దగ్గిర ఒక్కటే అగ్గిపుల్ల ఉంది. అక్కడ ఒక కిరసిన్ దీపం, నూనె స్టౌ, సిగరెట్టు ఉంటే దేనిని ముందుగా మీరు వెలిగిస్తారు. 4. స్టీలు బంతీ, రబ్బరు బంతీ —రెంటిలో ఏది బాగా పైకి లేస్తుంది? 5. 'భారతి'పత్రిక వ్యవస్థాపకులు ఎవరు? 6. 'ఎన్ సైక్లోపీడియా'ని తెలుగులో ఏమంటారు? 7. దీక్షనరీకీ, ఎన్‌సైక్లోపీడియాకీ తేడా ఏమిటి? 8. సీత ( ) చెట్టు — బ్రాకెట్లకు రెండు వేపులా ఉన్న పదాల అర్థం వచ్చే ఒకే మాటతో బ్రాకెట్టును పూరించండి. 9. రా. వి. శాస్త్రి పూర్తి పేరు ఏమిటి? 10. పా. ప. ఎవరు?

## జగద్విఖ్యాత ఇండియన్ వస్తాదులు



ప్రాచీన కాలం నుంచీ మల్ల విద్యకు ఇండియాలో ప్రాధాన్యం ఉంది. 19వ శతాబ్దిలో కొల్హాపూరు, పాటియాలా, బరోడా మొదలైన సంస్థానాధీశులు కుస్తీల పోటీలు ఏర్పాటు చేసి, విజయం పొందిన వస్తాదుకి 'రుస్తమ్-ఇ-హింద్' అనే బిరుదూ, ఒక రోలింగ్ బంగారపు గద బహూకరించేవారు.

కరీమ్ బక్ష్, గామాలు విదేశాలలో కూడా విఖ్యాతి పొందిన ఇండియన్ వస్తాదులు. 1892లో ఇంగ్లండ్‌కి చెందిన టామ్ కేనన్‌ని ఓడించి కరీమ్ బక్ష్ 'రుస్తమ్-ఇ-జమాన్'అనే వరల్డ్ ఛాంపియన్‌షిప్ గెలుచుకున్నాడు.

పంజాబ్‌కి చెందిన గామా 1909 లో ఇండియన్ ఛాంపియన్‌షిప్ గెలుచుకొని, ఆ తరువాత లండన్‌లో జరిగిన పోటీలలో డా. బెంజమిన్ రోలర్ అనే వస్తాదుని 7 ని.లలోనే రెండు సార్లు చిత్తు చేశాడు.

"నీ ప్రవర్తన విషయంలో నువు శ్రద్ధ వహించు:
గౌరవమర్యాదలు అవే నిన్ను వెతుక్కుంటూ వస్తాయి" -డి.యల్. మూడీ

## మాటల మహిమ

ఈ క్రింది మాటలకు సరియైన అర్థాన్ని/అర్థాలను గుర్తించండి:

1. వంశి: (ఏ) వెదురు, (బి) వంశంలో వాడు, (సి) మురళి, (డి) వశంవదుడు.

2. అజ: (ఏ) ఇంద్రుని (బి) బ్రహ్మ యొక్క (సి) విష్ణుని, (డి) ఆడమేక.

3. ద్విజ: (ఏ) పక్షి, (బి) జంట, (సి) బ్రాహ్మణుని, (డి) గడ్డి.

4. రుజ: (ఏ) వార్ధక్యం, (బి) పద్మం, (సి) వ్యాధి, (డి) నీరు

5. హంసి: (ఏ) నవ్వే స్త్రీ, (బి) ఆడ హంస, (సి) గాయని, (డి) రాణి.

6. ఆమని: (ఏ) వసంతం, (బి) ధనం, (సి) మారుతం, (డి) గడ్డి పూవు.

7. రుతి: (ఏ) ఋక్కు, (బి) ధ్వని, (సి) ఆంజనేయుడు, (డి) యుద్ధం.

8. నతి: (ఏ) ఆజ్ఞ, (బి) కావ్యం, (సి) నమస్కారం, (డి) అర్జీ.

9. శిత: (ఏ) తెల్లని, (బి) పదునైన, (సి) చల్లని, (డి) ఆశ్రయించిన.

10. పత్రి: (ఏ) గొడుగు, (బి) మారేడు ఆకులు, (సి) పత్రిక, (డి) పక్షి.

## అదృష్ట పాఠకుడు

పోసుకార్డు సైజులో మీ ఫొటోతో పహా సంగ్రహంగా మీ 'పరిచయం' వ్రాసి పంపండి. చీట్లు తీసి నిర్ణయించే అదృష్ట పాఠకుని/పాఠకురాలి ఫొటో, పరిచయం 'విస్డమ్'లో ప్రచురిస్తాం. రు. 10 లు ఖరీదు చేసే ఒక పుస్తకం కూడా ఆ అదృష్ట పాఠకుడికి లేదా పాఠకురాలికి పంపుతాం. ఫొటో వెనుక విధిగా అడ్రసు్స వ్రాయాలి. ఫొటోలు త్రిప్పి పంపబడవు.

## ముఖచిత్ర వ్యాఖ్య

ఆరు మాటలకు మించకుండా ఈ ‌ఛాయాచిత్ర ముఖచిత్రానికి తగిన శీర్షిక వ్రాసి పంపండి.

---

అధిక శక్తి గల 'క్రేన్'



యూరప్‌లోని వీధులలో వాడే పై చిత్రంలోని క్రేన్ మిక్కిలి శక్తి గలది. 8 ఇరుసులతో, 97.5 మీటర్ల పొడవు గల బాహువుతో కూడిన ఈ క్రేన్ 220 టన్నుల దాకా బరువు పైకి ఎత్తగలదు. ప. జర్మనీలోని 'క్రుప్' సంస్థ తయారుచేసిన రాకాసి క్రేన్ ఇది.

---

"ఒకరి లోపాలను ఒకరు క్షమించుకోలేనివారు స్నేహితులుగా ఎక్కువ కాలం ఉండలేరు." —బ్రూమేర్

## పాఠకుల అభిప్రాయాలు

దైనందిన జీవితంలో మీకు ఎదురయ్యే ఏ సంఘటనను గురించి అయినా ఒకటి, రెండు వాక్యాల్లో చమత్కారమైన వ్యాఖ్య వ్రాసి పంపండి. ఉత్తమ వ్యాఖ్యకు రు. 5 లు బహుమతి.

## మీ ప్రశ్నలు

వ్యక్తిగతమైనవి కాకుండా అందరికీ ఆసక్తి కలిగించే ప్రశ్నలు అడగండి.

ప్రముఖ సినీ నటి, కథా రచయిత్రి

శ్రీమతి పి. భానుమతీ రామకృష్ణ

జవాబు లిసారు.

విస్డమ్
పోటీల కూపను
మే 1983

## మీరైతే......

'అమెరికా వెళ్ళే ఛాన్స్ వస్తే' మీరైతే ఏం చేస్తారు? క్లుప్తంగా, చమత్కారంగా ఉండే జవాబు వ్రాయండి.

## [illegible]




8 మాటలకు మించకుండా పైన కని పిస్తున్న రెండు చిత్రాలనూ పరిశీలించి వాటికి వర్తించేట్టు చమత్కారమైన, లేదా ఆలోచన రేకెత్తించే శీర్షిక సూచించండి. ●

## మిక్కిలి ఖరీదైన కాఫీ గింజలు

ప్రపంచంలో మిక్కిలి ప్రియమైన కాఫీ గింజల రకం 'జమైకా హై బ్లూ మౌంటెన్ సుప్రీమ్'. దాని ధర పౌనుకి 16.80 డాలర్లు (సుమారు రూ. 170 లు).

"కొందరిని కొంత కాలం మోసగించవచ్చు; కొందరిని ఎల్లకాలం మోసగించవచ్చు; కాని అందరినీ ఎల్లకాలం మోసగించడం సాధ్యం కాదు." —అబ్రహాం లింకన్

# విచిత్ర ప్రాణి

ఆస్ట్రేలియాలో ఎక్కువగా కనిపించే 'ప్లాటిపస్' అనే విచిత్ర ప్రాణి ఒక విధంగా చూస్తే పక్షి; మరో విధంగా చూస్తే పిల్లలకు స్తన్యం ఇచ్చి పెంచే 'స్తనంధయ' జాతి mammal) జంతువు. బొచ్చుతో



కూడిన చర్మం గల ఈ ప్రాణి సుమారు 40 సెం మీ ల పొడు గుంటుంది. బాతు లాగ దీనికి ముక్కూ, నోరూ ఒకటే. వయస్సు వచ్చినా దానికి పళ్లు మొలవవు. నదుల, వాగుల గట్ల మీద రంధ్రాలు చేసి అక్కడ ఈ ప్రాణులు నివసిస్తాయి.

మగ 'ప్లాటిపస్' వెనక కాళ్ల గోళ్ళలో విషం ఉంటుంది. అవే దాని ఆత్మ రక్షణకు ఉపయోగపడతాయి. మగ ఆడ జీవులు రెండూ నీళ్ళలో ఈద గలవు. బాతు కాళ్ళ లాగ వాటి కాలి వేళ్ళు అతుక్కుని ఉంటాయి.

ఆడది గట్టు మీద రంధ్రం త్రవ్వి అందులో గుడ్లు పెట్టి వాటి మీద కూచుని పొదుగుతుంది. పిల్లలను చాలా నెలల దాకా ఆ సొరంగంలోనే ఉంచి, పాలిచ్చి పెంచుతుంది.

ఇవి నది అడుగు భాగానికి పోయి పురుగులనూ, నత్తలనూ వేటాడి తెస్తాయి. దౌడలలో ఉన్న సంచులలో వాటిని దాచి, ఒడ్డుకి వచ్చిన తరువాత నిదానంగా ఆరగిస్తాయి. నీటి మీద తేలుతూ అవి నిద్రపోగలవు. 'ప్లాటిపస్'లు మూనె కంపు కొడతాయి. కుక్క మొరుగుడు లాగ వాటి ధ్వని కర్కశంగా ఉంటుంది.

## మీరైతే?

(మార్చి 1983)

"హమ్మయ్య! ఇక వంటపని తప్పినట్లే!"

—కుమిలి నాగేశ్వరరావు,
శివరాం (విజయనగరం జిల్లా)

* * *

"మాది 'తెలుగు దేశం' పార్టీ సార్!
గెలవడం గ్యారంటీ!"

—పింగళి రామలక్ష్మి,
దువ్వాడ (విశాఖ జిల్లా)

* * *

"ష్....చిన్నగా అనండి సార్! మొన్న ఎన్నికల్లో ఓడిపోయి ఇంకా తేరుకో లేదు!"

—కె వి. చలపతి,
పుట్టపర్తి (అనంతపురం జిల్లా)

"ధైర్యవంతులకే పరిపూర్ణ విశ్వాసం ఉంటుంది." —సిసిరో

(8 వ పేజీ తరువాయి)

'ఇంత మహానటుణ్ణి కని భారతదేశం ధన్యం అయింది!' అన్నారు.

చివరి రోజులలో 'రాఘవ' సినీమా రంగంలో కూడా ప్రవేశించి 'ద్రౌపదీ మాన సంరక్షణం'లో దుర్యోధన పాత్ర పోషించారు. అంతకు ముందు మాధవ పెద్ది వెంకట్రామయ్య, యడవల్లి సూర్య నారాయణ మొదలైనవారు దుర్యోధన పాత్రకు చేసిన వ్యాఖ్యానం కంటె భిన్నంగా కొత్త పద్ధతిలో అభిమాన ధనుడుగా దుర్యోధనుని పాత్రను ఆయన వ్యాఖ్యానించారు.

వ్యాపార దృష్టితో కాకుండా కేవలం కళా రంగం మీది ప్రీతితోనే రాఘవ నాటకాలు ప్రదర్శించేవారు. వాటివల్ల వచ్చిన ఆదాయాన్ని ప్రజా సంస్థలకు ఇచ్చి వేసేవారు. తెలుగు నాటక రంగ చరిత్రలో అత్యున్నతమైన ప్రమాణాలను నెలకొల్పి నటులకు ఆయన ఆదర్శప్రాయు లయారు. ఆంధ్ర నాటక రంగానికి ఆయన చేసిన విశిష్ట సేవను గుర్తిస్తూ ఆంధ్ర నాటక కళా పరిషత్తు 'నాటక కళా ప్రపూర్ణ' అనే బిరుదుతో ఆయనను సత్కరించింది.

నాటక కళా రంగంలో ఆంధ్రుల ప్రతిభకు అంతర్జాతీయ ప్రశస్తి సంపాదించిన శ్రీ బళ్ళారి రాఘవ 1946 ఏప్రిల్ 17వ తేదిన తన 66వ ఏట పరమపదించారు. ●

## ముఖచిత్ర వ్యాఖ్య

### (మార్చి 1983)

"వేషమైతే వేశావు,
వయసు నెట్లా మార్చేవు?"

—జి. లక్ష్మీరాజ్యం, కురుపాం.

* * *

"చూశారా నా గొప్పతనం?
విస్డమ్ ముఖచిత్ర సౌందర్యం!"

—యు. హెచ్. ప్రసాద్, హైదరాబాద్.

* * *

"అలా చూస్తారేం? నేనేనండీ!
విస్డమ్ ముఖచిత్రాన్ని!"

—జె. వాసు, పాతపట్నం.

## ఇండియాలో మిక్కిలి ఎత్తైన డామ్



పంజాబ్‌లోని భాక్రా డామ్ ప్రస్తుతం ఇండియాలోని డామ్ లన్నిటిలో మిక్కిలి ఎత్తయినది. దాని ఎత్తు 221 మీటర్లు. అయితే ఉ.ప్ర. రాష్ట్రంలో నిర్మించబడుతున్న 261 మీటర్ల ఎత్తు గల తెహ్రీ డామ్ పూర్తి అయితే అదే మిక్కిలి ఎత్తైన డామ్ అవుతుంది.

"మనకు బంధువులను ఇచ్చేది భగవంతుడు;
మిత్రులను సంపాదించుకునేది మనమే!" -హాజ్‌లిట్

# జెలీపతీ ద్వారా వైద్యం

టి. శ్రీనివాసన్



[శ్రీ టి. శ్రీనివాసన్ బహుముఖ ప్రజ్ఞావంతులు. అనేక ఉన్నత పదవులు అతి సమర్థంగా నిర్వహించినవారు ఇండియాలో 'పాటి' రంగంలో విప్లవం తేవడానికి చాలా వరకు ఆయనే బాధ్యులు. 'టౌన్ ప్లానింగ్' డైరెక్టరుగా మద్రాసు, తిరుచ్చి, మదురై, కోయంబత్తూరు వంటి నగరాలకు ఆయన 'మాస్టర్ ప్లాన్'లు తయారు చేశారు.]

అతి ప్రాచీన కాలం నుంచీ ఇండియాలో హిందువులు వ్యాధి నివారణకు ఆయుర్వేద వైద్యం వాడుక చేస్తూ వచ్చారు. ఆ తరువాత దక్షిణ భారతదేశంలో - ముఖ్యంగా తమిళనాడులో — 'సిద్ధ' వైద్యం వెలసింది. ఎక్కువగా ముస్లిమ్ హకీములు 'యూనానీ' వైద్యవిధానంతో జబ్బులు నయం చేస్తున్నారు. ఇంగ్లీషువారి పాలనలో పాశ్చాత్య వైద్య విధానం అయిన 'అలోపతీ' ఇండియాలో అడుగు పెట్టింది. అనంతర కాలంలో-శామ్యుయెల్ హానెమాన్ అనే జర్మన్ వైద్యుడు కనిపెట్టిన — చాలా చిన్న డోసులలో మందిచ్చి రోగాలు నయం చేసే-హోమియోపతి వైద్య విధానం వాడుకలోకి వచ్చింది.

మరీ ఇటీవలి కాలంలో వెలసిన ఆశ్చర్యకరమైన వైద్య విధానం: 'జెలీ తెరపీ'.

---

## పాఠకుల అభిప్రాయాలు

(మార్చి 1983)

"నిజాయితీకి నిప్పంటిస్తున్నారు!
అన్యాయానికి హారతి పడుతున్నారు!"

—పి. జగదీష్ బాబు, విశాఖపట్టణం.

* * *

"ఆసియా క్రీడోత్సవాల చిహ్నం'అప్పూ'
అందుకే చివరికి మిగిలింది అప్పు!"

—టి. ఉమామహేశ్, తుంగభద్ర డామ్.

* * *

"గోచీ పెట్టుకుంటే 'ఏం రా!'
సూటు వేసుకుంటే 'మీరా!'"

—బర్ల వెంకటేశ్వరరావు, శృంగవరపుకోట.

"అంతస్సాక్షి ఎన్నడూ తప్పు త్రోవ పట్టించదు!"

టెలిపతీ ద్వారా దూరాన ఉన్న రోగులకు వైద్యం చేసే ఈ విధానం మిక్కిలి సూక్ష్మమైనది. హోమియోపతీ కంటె కూడా మరింత పటిష్ఠమైంది. 'టెలీ తెరపీ' నే పాశ్చాత్య దేశాలలో 'రేడీ స్తేషియా' అని కూడా అంటున్నారు. ఈ వైద్యంలో సజీవ, నిర్జీవ పదార్థాలన్నిటినుంచీ నిరంతరం వెలువడే రేడియేషన్‌లను మానవ గ్రాహక శక్తి (sensitivity) ద్వారా గుర్తించడం జరుగుతుంది. అమెరికాలో 1863 లో జన్మించిన డా. అబ్రహామ్ మొట్టమొదట - దేహం పరమాణువులతో కూడిన కణాలతో (cells) నిర్మింపబడిందనీ, ఆ పరమాణువులు నిరంతరం తీవ్ర సంచనాలతో ఎక్కువ ఫ్రీక్వెన్సీ గల రేడియేషన్‌లను వెలి గక్కుతూ ఉంటాయనీ కనుగొన్నారు. పదార్థం (matter) ఏ రూపంలో ఉన్నా రేడియేషన్‌లను వెలిగక్కుతుంది. విలక్షణమైన గ్రాహక శక్తి గల వ్యక్తులు - అంటే అతీంద్రియ శక్తులు గల వ్యక్తులు - మనుష్యులు గాని, ఇతర జీవులు గాని వెళ్ళగక్కే అలాంటి రేడియేషన్‌లను గుర్తించ గలరు.

ప్రాణుల నుంచి వెలువడే ఈ రేడియేషన్‌లను గురించి మన ప్రాచీన ఋషులకు తెలిసి ఉన్నట్టు కనిపిస్తుంది. విశ్వం అంతా ప్రాణం (life) తోనూ, వర్ణంతోనూ నిండి ఉన్నదని వారు గుర్తించారు. ఈ రేడియేషన్, లేదా శక్తి ప్రకృతిలో అయస్కాంతాలు, స్ఫటికాలు, రత్నాలు, కాంతి, ఉష్ణత, జీవ కణాలు మొదలైన వాటిలో స్పష్టంగా గుర్తించ బడింది. కొందరు వ్యక్తులు తమ ప్రాణ శక్తిని రోగుల వద్దకు ప్రసరింప చేసి వారి వ్యాధులు నివారణ చేయగల రని కూడా కనుగొనబడింది. స్పందనల (vibrations) రేటులో మార్పు రావడంవల్ల వ్యాధులు వస్తాయి. ఆ రేటును సవరించ గలిగితే ఆ వ్యాధులను నివారించవచ్చు.

అలా సవరించడం సాధ్యమా? ఏ సాధనల ద్వారా రోగిలో స్పందనాల రేటును సక్రమంగా ఉండేట్టు చేయగలం? ఇలాంటి ప్రశ్నలకు జవాబుగానే 'టెలీ తెరపీ' అవతరించింది. బ్రిటన్‌లోనూ, యూరప్‌లోనూ అల్లోపతీ వైద్యంలో ఆరితేరిన డాక్టర్లు అనేకులు కచ్చితమైన రోగ నిదానానికీ, మందుల

## అదృష్ట పాఠకుడు

(మార్చి 1983)



ఆడారి కొండలరావు, S/o యల్లయ్య, పొలిమేర వీధి, గవరపాలెం, అనకాపల్లి — 531 002 (విశాఖ జిల్లా), హాబీలు: పుస్తకాలు చదవడం, సాహిత్య ఉపన్యాసాలు వినడం, రాజకీయాల్లో పాల్గొనడం.

"స్నేహితులను నిశితంగా పరీక్షిస్తే శత్రువులను ప్రేమించగలం!" —కవిరాజ మూర్తి

'ఫొటెన్సీ'నీ, దోసునూ నిర్ణయించడానికి 'లోలకాన్ని' (పెండ్యులాన్ని) వాడుక చేస్తున్నారు. వీరు అల్లోపతీ వైద్యులైనా హోమియోపతీ మందులే వాడుతున్నారు. అల్లోపతీ మందుల లాగ రోగ లక్షణాల తాత్కాలికమైన ఉపశమనానికి కాకుండా రోగాన్ని పూర్తిగా నిర్మూలించడానికి హోమియోపతీ మందులు ఉపయోగిస్తారు. సుప్రసిద్ధులైన బ్రిటిష్, ఫ్రెంచ్ డాక్టర్లు ఎందరో 'రేడీస్తెషియా' (టెలీ తెరపీ) ని గురించి పుస్తకాలు వ్రాశారు. ఈ వైద్యాన్ని ప్రస్తుతం ఎక్కువగా వాడుక చేస్తున్న ఇంగ్లండులో రోగ నిదానానికి, మందును నిర్ణయించడానికి రోగి డాక్టరు ఎదుట ఉండడం అవసరం. కాని, ఇండియాలో టెలీ తెరపీ వైద్యం పొందడానికి రోగి డాక్టరు దగ్గిరికి రావలసిన అవసరం లేని పద్ధతిని కనుగొన్నారు. అంతే కాదు. రోగి చేదు మందులు మింగవలసిన అవసరం గాని, ఇంజక్షనులు, ఆపరేషన్‌లు మొదలైన బాధాకరమైన చికిత్సకు తల ఒగ్గవలసిన అవసరం గాని లేదు. కృతకంగా శక్తి తరంగాలను ఉత్పాదన చేసి రోగి ప్రపంచంలో ఏ మూల ఉన్నా అక్కడికి వాటిని వారి ఫొటోగ్రాఫుల ద్వారా ప్రసారం చేస్తారు. ఈ విధంగా ఇప్పుడు టెలీ తెరపీ వల్ల తన ఇంట్లో కూర్చొనే రోగి తన రోగం నుంచి విముక్తి పొంద గల అపూర్వమైన అవకాశం ఏర్పడింది.

ఈ వైద్య విధానంలో 5, 7, 9, 16, లేక 30 పెర్మనెంట్ అయస్కాంతాలు ఉన్న పెట్టెను, ఒక 'లోలకాన్నీ', 'నవరత్నాలనూ' స్పందనలు కలిగించే 'వైబ్రేటర్'నూ, కొన్ని ఛార్ట్‌లనూ వాడుక చేస్తారు. అయస్కాంతాల పెట్టెపై తగిన ఛార్ట్‌మీద రోగి ఫొటో ఉంచి 'లోలకం' సాయంతో రోగాన్ని గుర్తిస్తారు. 'వైబ్రేటర్' పెట్టెలోకి ఒక ప్లగ్ ద్వారా 230 వోల్ట్‌ల ఏ. సి. కరెంటు పంపుతారు. రోగి స్థితికి అనుగుణమైన రత్నాలను నిర్ణయించి ఒక సంచీలో పెట్టి వాటిని 'వైబ్రేటర్' పెట్టెలో వ్రేలాడదీస్తారు. తరువాత గాయత్రీ మంత్రాన్నీ, మృత సంజీ

---

## ఇంధనం అక్కరలేని విద్యుత్కేంద్రం



దక్షిణ స్పెయిన్‌లోని 'మేంజనరీస్'లో ప్రాయోగికంగా నిర్మించిన విద్యుత్కేంద్రం ఇంధనం అక్కర లేకుండా పని చేస్తూంది. సూర్యుడి వేడికి గాలి వ్యాకోచం చెంది ఒక టన్నెల్ ద్వారా 60 కి.మీ.ల వేగంతో ప్రవహిస్తూ, ఒక టర్బైన్‌ని నడుపుతుంది. ఈ కేంద్రం 100 కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయగలదు.

---

"పని చెయ్యకుండా జీవితాన్ని వృథా చేసుకోడం కంటె,
పని చేస్తూ తప్పులు చేసినా మేలే!" -జార్జ్ బెర్నార్డ్ షా

పనీ మంత్రాన్నీ 'వైబ్రేటర్' పెట్టెలో ఉంచుతారు. నిముషానికి 3,000 స్పందనాల చొప్పున వైబ్రేటర్ స్పందిస్తుంటే ఆ యంత్రాల ద్వారా వచ్చిన తరంగాలు రత్నాల ద్వారా ప్రసరించి కాస్మిక్ శక్తిని వెలువరుస్తాయి. తొమ్మిది రత్నాలూ తొమ్మిది రంగులను వెలువరుస్తాయి. ఆ శక్తి రోగి ఫోటోను తాకగానే రోగిలో లోపం ఏర్పడిన వర్ణాల స్పందనరేటు మామూలు స్థితికి వస్తుంది.

వైద్యం ఆరంభించే ముందు ఆ ఫొటోలను పూజలో పెట్టి శివుడికి విభూతితో అంగలింగార్చన, మూకాంబికా దేవికి లలితా సహస నామార్చన వంటివి చేస్తారు. 'నమశ్శివాయ' అనే మంత్రం శరీరం అంతటినీ సూచిస్తుంది గనుక శివునికి లింగార్చన చేయడంవల్ల రోగుల దేహంలోని ఏ భాగంలోని వ్యాధి అయినా నివారణ అవుతుంది. మూకాంబికార్చనవల్ల మూగవారికి మాటలు వస్తాయి. ఉన్మాదం, నత్తి మొదలైనవి నయం అవుతాయి. శక్తికి కుంకుమార్చన కూడా చేస్తారు.

అవిశ్వాసులైన హేతువాదులు మంత్రాలూ, వాటి స్పందనలూ, రత్నాల నుంచి వెలువడే రేడియేషనూ జబ్బులను నయం చేస్తాయా అని సంశయం ప్రకటించవచ్చు. ఇదేదో కాకమ్మ కథ అని వారు కొట్టి పారేయవచ్చు. కాని ఇది పూర్తిగా శాస్త్రీయమైన విధానం. చంద్రునిమీద దిగిన చిన్న నౌక (lunar module) తప్పు దారిలో పోతూంటే రేడియో తరంగాల ద్వారానే 'నాసా' శాస్త్రజ్ఞులు దానిని సరియైన మార్గంలోకి మళ్ళించారు. మంత్ర శక్తి కూడా సరిగ్గా అలాంటి రేడియో తరంగాలనే సృష్టిస్తుంది. అందుచేత 'టెలీ తెరపీ' ఇతర వైద్య విధానాలన్నిటి కంటె మిక్కిలి ప్రశస్తమైంది; పటిష్ఠమైంది. ●

## మిక్కిలి పెద్ద భూగర్భ సరోవరం

భూగర్భంలోని సరస్సులలో మిక్కిలి పెద్దది టెన్నెసీ (అమెరికా) లోని 'క్రేగ్ హెడ్ కేవెర్న్స్' ప్రాంతంలో ఉంది. 4½ ఎకరాల విస్తీర్ణం గల ఈ సరస్సు భూగర్భంలో 300 అ. ల లోతున ఉంది. 1905లో ఈ సరస్సును కనుగొన్నారు.

## క్రీడలలో మిక్కిలి పెద్ద జట్టు



కేరళ రాష్ట్రంలో ప్రతి ఏడాదీ ఆగస్టునెల రెండో శనివారం నాడు జరిగే 'చుండాన్ వల్లమ్స్' అనబడే సర్పాకారపు పడవల పోటీలలో పాల్గొనే జట్లలో ఒక్కొక్కదానిలో 100 మంది సభ్యులుంటారు. ప్రతి పడవనూ 100 మంది తెడ్లువేసి నడుపుతారు. ప్రపంచ క్రీడలలో మిక్కిలి పెద్ద జట్టు పాల్గొనే క్రీడ ఇదే.

"దైవం యొక్క నీడే వెలుతురు." —ప్లేటో

# పోటీలు (ఫలితాలు)

(మార్చి 1983)

వ్యాసం: మొదటి బహుమతి: ఎస్.ఎమ్. కె. అమర్‌నాథ్ గుప్త, నెల్లూరు: రెండవ బహుమతి: ప్రసాద్ తుమ్మా, బాలాజీ నగర్ (కోదాడ తాలూకా); మూడవ బహుమతి: వోగేటి సత్యనారాయణ రావు, నిజామాబాద్.

క్విజ్: జవాబులు: 1. లాల్ బహదూర్ శాస్త్రి, 2. 70 ఏళ్ళు, 3. సియోల్ (seoul), 4. రాజస్థాన్ ఎడారిలోని పోఖ్రాన్‌లో, 5. అంతరిక్ష యానాన్ని గురించి, 6. ఎర్ర త్రికోణం, 7. చదరంగంలో, 8. ఒక తోక ఉన్న నక్షత్రం లాంటిది తోక చుక్క; సూర్యుని చుట్టూ అండాకార కక్ష్యలో ఇది పరిభ్రమిస్తుంది, 9. సమకాలికులు (సమకాలీనులు), 10. క్రికెట్ ఆటలో.

విజేతలు: మొదటి బహుమతి: కె. కళ్యాణవల్లి, చీరాల; రెండవ బహుమతి: తాకాశి వెంకటరావు, అనకాపల్లి; మూడవ బహుమతి: బి సుదర్శన రెడ్డి, కొత్తపేట (నిజామాబాద్ జిల్లా).

పజిల్: జవాబులు అడ్డం: 1. రామాయణము, 3. మరఠా, 6. తెరచాప, 7. ధమనులు, 10. కల, 11. రతి పోగు, 12. పాము, 13. తెగి, 15. సీతో, 16. లల, 17. పావురము, 21. గురి, 22. వరి మోకు, 24. దేవయాని, 26. శంకరా!, 27. జీవన్ ముక్తులు.

నిలువు: 1. రాబడి, 2. యశోధర, 3. మరఠ, 4. ర, చా, క, పా, సీ, 5. చాపల ముతో, 6. తెలుగు, 8. మతి, 9. ను పో, 13. తెలుగు దేశం, 14. గి, ల, రి, వ, క, 17. పావని, 18 పురి, 19. రమో, 20. ముకురము, 23. భక్తులు, 25. యా.గా

విజేతలు: మొదటి బహుమతి: ఏ. రఘునందన్, బోర్లం (నిజామాబాద్ జిల్లా); రెండవ బహుమతి: ఎమ్. ప్రభావతి, హైదరా

## పావురం రికార్డు పయనం



సైన్యం తాలూకు ఒక పావురం 1939లో 'మెయిన్' నుంచి ఫోర్ట్ శాన్ హూస్టన్ (టెక్సాస్) దాకా 2,300 మైళ్ళు ఏకధాటిన ఎగిరి సందేశాన్ని అందజేసింది. పావురం పయనించ గల దూరానికి అదే ప్రపంచ రికార్డు.

"డబ్బు లేని వారిని చట్టం శాసిస్తుంది; చట్టాన్ని ధనవంతులు శాసిస్తారు." —గోల్డ్‌స్మిత్

బాద్; మూడవ బహుమతి: మాదిరాజు నాగ భూషణరావు, కొడవటి కల్లు (నందిగామ తాలూకా).

తెలివికి పరీక్ష: జవాబులు: 1. 211 (బ్రాకెట్‌కి ముందూ, వెనుకా ఉన్న సంఖ్యలను కూడి 3 తో భాగిస్తే బ్రాకెట్‌లో సంఖ్య వస్తుంది), 2. రతి, 3. రాజు, 4. వాత్స్యాయనుడు, (ఈయన కామసూత్ర రచయిత), 5. తడవడం, 6. కాకి, కేకి, కోక మొ., 7. కాఫీ, టీ (ఇవి పానీయాలు, తక్కినవి రుచులు), 8. 1,000, 9. 4 చేత శేషం లేకుండా భాగించబడే సంవత్సరాన్ని, 10. చాంద్రమానంలో లోపించిన మాసం, అధిక మాసానికి ఇది వ్యతిరేకం.

విజేతలు: మొదటి బహుమతి: కుమారి లక్ష్మి రాజ్యం, కురుపాం (విజయనగరం జిల్లా): రెండవ బహుమతి: డి. చంద్రశేఖర్, బొర్లం: మూడవ బహుమతి: పి. శ్రీనివాసులు, బొర్లం.

మాటల మహిమ: జవాబులు: 1. కవిత్వం చెప్పేవాడు (బి), శుక్రుడు (డి), 2. వజ్రాయుధం (పి), 3. సూర్యుడు (బి), 4. భూమి (పి), 5. స్వర్గం (బి), 6. రుచి (డి), 7. అని (పి), 8. గుహ (బి), ఆవు (పి), 9. భవిష్యత్తు (డి), 10. జరాయువు (ఏ), మామిడి (డి).

విజేతలు: మొదటి బహుమతి: పుర్జాన హేమారావు, ఖరగ్ పూర్; రెండవ బహుమతి: బి. గీత, డోర్నకల్; మూడవ బహుమతి: బి. రాజేశ్వరమూర్తి, మచిలీపట్నం.

అదృష్ట పాఠకుడు: ఆడారి కొండలరావు, అనకాపల్లి.

ముఖచిత్ర వ్యాఖ్య: మొదటి బహుమతి: జి. లక్ష్మీరాజ్యం, కురుపాం; రెండవ బహుమతి: యు హెచ్. ప్రసాద్, హైదరాబాద్; మూడవ బహుమతి: జె. వాసు, పాతపట్నం.

పాఠకుల అభిప్రాయాలు: మొదటి బహుమతి: పి జగదీష్ బాబు, విశాఖపట్నం; రెండవ బహుమతి: టి. ఉమా మహేశ్, తుంగభద్ర డాం; మూడవ బహుమతి: బర్ల వెంకటేశ్వరరావు, శృంగవరపు కోట.

మీ ప్రశ్నలు: ఉత్తమ ప్రశ్న: ధరణి కోట అనసూయమ్మ, నెల్లూరు.

మీరైతే? : మొదటి బహుమతి: కుమిలి నాగేశ్వరరావు, శివరాం (విజయనగరం జిల్లా); రెండవ బహుమతి: పింగళి రామ లక్ష్మి, దువ్వాడ; మూడవ బహుమతి: కె.వి. చలపతి, పుట్టపర్తి.

భావ పరిచయ పోటీ: మొదటి బహుమతి: ఎస్. మనోహర్, నెల్లూరు; రెండవ బహుమతి: టి. శ్రీనివాస్, కాకినాడ; మూడవ బహుమతి: డి.ఎస్. జాన్సన్, పాలకొల్లు.

## నాణేలకూ, నోట్లకూ అయ్యే ముద్రణ ఖర్చు

రూపాయి బిళ్ళ ముద్రణకు 70.38 పైసలూ, రూపాయి నోటు ముద్రణకు 3.5 పైసలూ ఖర్చవుతూంది.

"విపత్తుల నుండి రక్షించమని కాదు:
ఆపదలను ఎదుర్కొనే ధైర్యాన్ని నేను కోరుకుంటాను." —రవీంద్రుడు